రచయిత - ఎ. పండరీనాథ్

తెలుగు పాఠకలోకానికి బాగా పరిచయం ఉన్న రచయిత - నలభై అయిదు సంవత్సరాలుగా తన రచనలకు పదును పెడుతున్నారు.

పుట్టింది వరంగల్ జిల్లా పెంబర్తిలో - ఉంటున్నది హైదరాబాద్ మహానగరంలో, తల్లిదండ్రులు పోచయ్య, రుక్మిణమ్మలు, భార్య సరస్వతమ్మ.

దేశభక్తి, త్యాగనిరతి, జాతీయ సమగ్రత, సద్విలువలు ప్రతిబింబించే గ్రంథాలెన్నో ఆయన కలం నుండి వెలువడ్డాయి.

"పండరీనాథ్! నీ కలాన్ని మంచి దారిలో నడిపిస్తున్నందుకు, నీ పరిశోధనకు, నీ పరిశ్రమకు ఒకనాటికి జాతి తప్పకుండా గుర్తిస్తుంది" అని మహాకవి దాశరథి గారన్నట్లు వీరి పుస్తకాలు అయిదు జాతీయ స్థాయిలో గుర్తింపు పొందాయి. ఎందరి ప్రశంసలో అందుకున్నాయి.

"You are doing a Nobel work. It will Inspire generations in Future" అంటూ [illegible] ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు రాజా మహేంద్ర ప్రతాప్ కితాబు పొగిడారు.

సమకాలీన సమస్యల పట్ల అందరినీ స్పందింపచేయడం యువతను దేశానికి కార్యోన్ముఖులను చేయడం ప్రధాన ఆశయంగా పెట్టుకున్నారు.

- ఏ. వెంకటరామారావు
అడ్వకేట్, హైదరాబాద్

# హైదరాబాద్ విముక్తి పోరాటం

## నిజాంపై బాంబుదాడి

## స్వాతంత్ర్య సమర వీరుడు నారాయణరావు పవార్

ఎ. పండరీనాథ్

# స్ఫూర్తి వచనాలు



హైదరాబాద్ పరిస్థితులు నానాటికీ క్షీణిస్తున్నవి. ఒక్కొక్క వార్త వింటే ఎవరో గొంతు నులిమినట్టనిపిస్తుంది. ఊపిరాడకున్నది. హైదరాబాద్ రాష్ట్ర ప్రజలు ఈదుతున్నది ఏటికి ఎదురీత. ఎక్కుతున్నది హిమాలయ పర్వత శిఖరం. అది ప్రమాదభరితమైనది. అయినా పోరాటానికి నడుం కట్టినారంటే వారి ధైర్య, స్థైర్యాలు మెచ్చుకోదగినవి.

అక్కడి ప్రజలు సత్యానికి పాటుపడుతున్నారు. వారు హింసించ బడుతున్నారేగాని ఎవరినీ హింసించడం లేదు. కాబట్టి విజయలక్ష్మి వారినే తప్పక వరిస్తుందని ఆశిస్తున్నాను.

**- పూజ్య బాపూజీ**

---

# హైదరాబాదు ఉద్యమానికి అంతర్జాతీయ ప్రాముఖ్యత ఉంది



హైదరాబాదు ప్రజలు జరిపిన సత్యాగ్రహం మౌలికమైన పౌర హక్కుల సాధన కొరకు అని లోకం గుర్తించాలి. ప్రపంచంలో మానవ మాత్రులు ఎక్కడ ఉన్నా మానవునిగా మనగలగాలి. తల ఎత్తుకు తిరగాలి. అది మానవుని మౌలికమైన హక్కు. అందుకే హైదరాబాదులో జరిగిన సత్యాగ్రహానికి అంతర్జాతీయ ప్రాముఖ్యత ఉంది.

**- విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్**



## హైదరాబాద్‌లో జరుగుతున్నది పౌరహక్కుల పోరాటం

హైదరాబాదులోని ప్రజలందరూ మానవులుగా జన్మించారు. అందుకని వారు లోకంలోని ఇతర మానవుల వలె మనుగడ సాగించటానికి హక్కు కలిగి ఉన్నారు. అది జన్మతః వచ్చిన హక్కు. ఆ దేశానికి రాజైన వాడు మానవునికి జన్మతః సంక్రమించే పౌరహక్కులను కాదనలేడు. ప్రతిఘటించటం ఒక్కటే మార్గం. పౌరహక్కుల సాధనకు జరిగే పోరాటంలో పార్టీ ప్రమేయం ఉండరాదు. ఏ రాజకీయ పార్టీ వారైనా సరే పౌర హక్కులు సాధించే సమరంలో సహకరించాలి. ఈ ఉద్యమాన్ని ఎవరు ఆరంభించారని చూడ కూడదు.

హైదరాబాదులో జరుగుతున్న పౌరహక్కుల పోరాటాన్ని రాజకీయ పార్టీలన్నీ ఛాలెంజీగా తీసుకోవాలి.

**- జవహర్ లాల్ నెహ్రూ**

---

## ఒక సంస్థను అస్తిత్వంలోకి రానీయక పోవడం అమానుషం

హైదరాబాదు ప్రజలు స్టేటు కాంగ్రెస్ అనే సంస్థను పెట్టుకుంటున్నామంటే అక్కడి ప్రభుత్వం కాదు కూడదు అన్నది. పుట్టబోయే సంస్థను పుట్టనీయకుండా భ్రూణహత్య నేరానికి పాల్పడింది. ఈ చర్య అక్రమమైందే కాదు అమానుషమైంది కూడా. ఒక సంస్థ, అది ఏదైనా కానివ్వండి. ఏర్పడినాక దాని కార్యకలాపాలను చూసి అవి సబబుగా లేకుండా సంజాయిషీ అడిగి తర్వాత చర్య తీసుకోవటం సభ్య మానవుల లక్షణం. హైదరాబాదు ప్రభుత్వం స్టేటు కాంగ్రెస్ సంస్థను అస్తిత్వం లోకి రానీయకుండా ఆంక్ష విధించటం అమానుషం.



**- మౌలానా అబుల్ కలాం ఆజాద్**



## మీరు రక్తాన్ని ఇస్తే నేను స్వాతంత్ర్యాన్నిస్తా!



పూర్ణ వికసిత గులాబీ పుష్ప సౌరభం నీకు కావాలా? అయితే కంతికాలను సైతం నీవు స్వీకరించాల్సిందే. మందస్మిత ఉషోదయపు మాధుర్యాన్ని వాంఛిస్తున్నావా?

అయితే గాఢ నిశాంధకరపు ఘడియల గుండా నీ జీవితం సాగాల్సిందే. స్వేచ్ఛానందాన్ని, స్వాతంత్ర్య ప్రశాంతిని అభిలషిస్తున్నావా?

అయితే వాటి ఖరీదు నీవు చెల్లించాల్సిందే. బాధ, త్యాగం-ఇవే స్వేచ్ఛకోసం నీవు చెల్లించాల్సిన మూల్యం.

మీరు రక్తాన్నిస్తే నేను స్వాతంత్ర్యాన్నిస్తా!

**- నేతాజీ**

---

## ఉరికంబాన్ని పూల మాలగా భావించి...



*తనను శిక్ష నుంచి తప్పిస్తామన్న జైలులోని సహచర విప్లవకారులకు ఉరితీయడానికి ముందు రోజు భగత్ సింగ్ రాసిన లేఖ*

తేది. 22-3-1931

కామ్రేడ్స్!

బతకాలన్న కోరిక సహజంగానే ఉండాలి నాలో. ఆ ఉద్దేశాన్ని మనులోనే దాచుకోదలచుకోలేదు నేను. అయితే జీవించాలంటే నాదొక షరతు. ఖైదీగా, బంధనాల్లో బతకాలని లేదు.

దేశం కోసం, మానవత్వం కోసం నా మనసులో మొదలవుతున్న ఆలోచనల్లో వెయ్యోవంతయినా పూర్తి చేయలేక పోయాను. ఒక వేళ బతికే ఉంటే, బహుశ వాటిని పరిపూర్తి చేసేందుకు నాకు అవకాశం లభించి ఉండేది. అప్పుడు నా ఆలోచలను కార్యరూపంలో పెట్టి ఉండేవాడిని.

**- సర్దార్ భగత్ సింగ్**

# హైదరాబాద్ సంస్థాన విమోచన సమయంలో నాయకులు



"సత్యం, అహింసా సిద్ధాంతాలపై సంపూర్ణ నమ్మకమున్నవారు
సత్యాగ్రహం చేయాలి"

- బాపూజీ





"నేను కలలుగన్న భారతదేశాన్ని నిర్మించడం ప్రజలందరి కర్తవ్యంగా
భావిస్తే భారతదేశం స్వర్గధామమే అవుతుంది"

- పండిత జవహర్‌లాల్ నెహ్రూ



భారత ఉప ప్రధాని సర్దార్ వల్లభ భాయి పటేల్





మహా ఘనత వహించిన నిజాం మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ పాదుషా



రజాకార్ల నాయకుడు కాసిం రజ్వీ





ఎడమ నుంచి : మిలిటరీ పాలకుడు చౌదరి, ఏజెంటు జనరల్ కె.యం. మున్షి, స్వామి రామానంద తీర్థ



విలీన ఉద్యమ సారథి
కాంగ్రెస్ నాయకులు స్వామిరామానంద తీర్థ





ఉక్కు మనిషి, నాటి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు
సర్దార్ జమలాపురం కేశవరావు



విమోచన పోరాటం సాగించిన ప్రముఖ సమర యోధులు
పాగ పుల్లారెడ్డి, బొమ్మకంటి సత్యనారాయణ, హయగ్రీవాచారి



ఇ.నెం. 1-10-223,
అశోక్ నగర్, హైదరాబాద్ - 500 020.
ఫోన్ నెం. 27606666



**ఆచార్య కొండా లక్ష్మణ్ బాపూజీ**
స్వాతంత్ర్య సమరయోధులు
మరియు మాజీ మంత్రివర్యులు

## తెలంగాణా ప్రజలకు ఓ అపూర్వ కానుక

స్వార్థం అవినీతి బాగా పెరిగిపోతున్న ఈ రోజుల్లో దేశాభిమానం, దేశ భక్తి, నిస్వార్థ సేవాభావం కనుమరుగైపోతున్నది.

ఈనాటి శాసన సభలలో ప్రజా ప్రతినిధులు ప్రజల సమస్యలను ప్రక్కన బెట్టి బుద్ధి ప్రదర్శనకంటే తమ గొంతు ప్రదర్శన కనబరుస్తున్నారు. నేరస్థుల, పెట్టుబడీదారుల, అంగబలం ఉన్నవారి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతున్నది.

తరతరాలుగా సామాజిక న్యాయానికి నోచుకోనటువంటివారు దోపిడీలకు అన్యాయాలకు గురవుతున్నారు. అలాంటి వారిని పట్టించుకునే వారు కరువువౌతున్న రోజులివి.

ఇలాంటి తరుణంలో ఒకసారి స్వాతంత్ర్యోద్యమ కాలం నాటి పరిస్థితులనూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుకోడానికి ఆనాటి సమరయోధులు జరిపిన పోరాటాన్ని, వారిలోని కర్తవ్య పరాయణత, త్యాగనిరతి, పట్టుదల, దీక్షలనూ నెమరేసుకోవలసిన అవకాశం కలిగించడం ఎంతేనీ ముదావహం. ఇట్టి అవకాశం ఈ గ్రంథం కలిగిస్తున్నందులకు ప్రశంసిస్తున్నాను.

హైదరాబాద్ సంస్థాన విముక్తి పోరాట చరిత్రను తీసుకుంటే దానికి ప్రపంచ చరిత్రలోనే అద్వితీయ స్థానం ఉంది. మతపరమైన సంస్థలు అనగా అంజుమన్ ఇత్తెహాద్ ఉల్ ముసల్మీన్ మరియు రజాకార్ల వత్తిళ్ళతో నిస్సహాయకుడుగా నిజాం చేసిన నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా సాగిన ఆనాటి పోరాటాన్ని నేను కళ్ళారా చూశాను. అందులో ప్రముఖంగా పాల్గొన్నాను.

ఇక్కడి ప్రజల హక్కులను కాలరాచి, రజాకార్ల దళాలచే హిందూముస్లిం తదితర జాతీయం భావాలుగల ప్రజలపైన జరిపిన దమనకాండ తలచుకోరానటువంటిది. ఆనాటి పరిపాలన తీరును, రజాకార్లు కావించిన దోపిడీలు, హత్యలు, మానభంగాలు తదితర అమానుష కృత్యాలను తలచుకొంటే ఇప్పటికి ఒళ్ళు జలదరిస్తుంది.

ఈ విధమైన దుష్ట పరిపాలనను ఎదిరించి, స్వేచ్ఛాయుత ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడానికి ఆనాడు ఎందరో మహానుభావులు ఎన్నో ఉద్యమాలు నడిపారు. అహింసా విధానాన్ని అవలంబించి సత్యాగ్రహాలు చేసి జైలుకెళ్ళారు. చివరికి విసిగి వేసారి పోయిన కొందరు ఆ దుష్ట పాలనను అంతముందించడానికి విప్లవ పంథానే ఎంచుకొన్నారు. ఈ క్రమంలో నిజాం రాజుపై బాంబు దాడి జరిపిన నారాయణరావు పవార్ ప్రముఖులు.

ఆ ఉద్యమ కాలంలో నేను షోలాపూర్లో నైజాం రాష్ట్ర ప్రజల ఉద్యమ క్యాంప్ నిర్వహించు చుంటిని. నా వద్దకు వచ్చి నారాయణరావు పవార్ సలహా సహాయాలు కోరిన క్రమంలో వారికి నడుస్తున్న కారులో కూర్చున్న వారిపై బాంబు మోస్తరి బంతి విసిరే శిక్షణ పొందే వ్యవస్థగావించి, బాంబు విసిరే కార్యక్రమం 1947, డిసెంబర్ 4వ తేదీని మరియు స్థలం నిర్ణయించి బాంబులు మరియు ప్రయాణ ఖర్చులు తదితర అవసరాల గూర్చి తోడ్పడిన గౌరవం నాకు లభించింది.

1947 డిసెంబర్ 4న సాయంత్రం 4 గంటల నుండి షోలాపూర్లో నేను పై కార్యక్రమ నిర్వహణ వార్త కోసం ఎదురుచూస్తూ రేడియో వద్ద కూర్చున్నాను. చివరకు నిజాంపై బాంబుదాడి జరిగింది కాని అది విఫలమైందన్న వార్త సుమారు 5 గంటలకు రేడియోలో ప్రసారమైంది. దాడి చేసిన నారాయణరావు పవార్ పట్టుబడినాడనే ప్రకటన చేయబడింది.

తరువాత విషయసేకరణ కొరకు పోలీసులు నారాయణ రావు పవార్‌ను నానాహింసలకు గురచేసినారు. అరెస్టు చేయబడిన వీరిపైన కేసు పెట్టబడింది. ఆ కేసులో పట్టుబడని ముద్దాయిగా నా పేరు కూడా పేర్కొనబడినది. ఈ కేసులో నారాయణరావు పవార్ గారికి ఉరిశిక్ష విధించబడినది. తుది అప్పీల్ పరిష్కారం కాక పూర్వమే భారత ప్రభుత్వం నిజాం ప్రభుత్వంపై పోలీస్ ఏక్షన్ జరిపినందున 17 సెప్టెంబర్ 1948న నైజాం లొంగిపోయి నిజాం రాష్ట్రం భారతదేశంలో విలీనం చేయబడి నిర్మాణమైన మిలిటరీ ప్రభుత్వం వారు పై కేసును మరియు యితర అన్నీ కేసులు, అరెస్టులు వారెంట్లు పెండింగులో వున్న వాటిని విరమించుకొన్నారు. తత్ఫలితంగా నారాయణరావు పవార్ ఉరి శిక్ష నుండి విముక్తులైనారు. నాపై వున్న ఆ కేసుకు సంబంధించిన మరియు యితర కేసులలో వున్న 13 అరెస్టు వారెంట్లు విరమించుకోబడిన తర్వాత 27 నవంబరు 1948లో నేను తిరిగి హైదరాబాద్ చేరుకున్నాను.



ఒక రాజుపై బాంబు దాడి చేయడమంటే యెంతో ధైర్య సాహసాలు, తెగింపు కావాలి. ఇవన్నీ నిండుగా వున్న నారాయణరావు పవార్ గాథ మరుగునపడిపోవడం ఎంతో దురదృష్టకరం. అప్పటి చరిత్రల దేశభక్తిగల విప్లవ వీరుడు నారాయణరావు పవార్. భారత దేశంలో క్రాంతి కారులు భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ వలె నారాయణరావు పవార్ నిజాం రాష్ట్రంలో క్రాంతి కారుడుగా గుర్తింపు పొందినాడు.

తెరమరుగున వున్న ఇంతటి ధైర్యశాలి. క్రాంతి వీరుని జీవిత చరిత్రను గ్రంథస్థం చేసి ఒక గొప్ప పని చేశారు ప్రముఖ రచయిత శ్రీ ఎ. పండరీనాథ్‌గారు. నారాయణరావు పవార్ చరిత్రలో అప్పటి హైదరాబాద్ రాష్ట్ర విమోచన ఉద్యమపోరాటాన్ని కూడా రచయిత ఈ పుస్తకంలో పేర్కొన్నారు. అందువల్ల ఈ పోరాట గాథ తెలియని వారికి కూడా తెలుపుతున్నట్లయింది.

ఈ గ్రంథంలో నారాయణరావు పవార్ గారి జీవిత చరిత్రలో ముఖ్యమైన క్రాంతి పాత్రతోపాటు అప్పటి హైదరాబాదు విమోచన పోరాటంలో అనేక ఘట్టములు పేర్కొనబడడటం ఎంతో ప్రశంసనీయం. ఈ గ్రంథం వారి జీవితకాంలోనే ప్రచురించబడటం విశేషమైనది. స్వాతంత్ర్య సమర యోధుడు నారాయణరావు పవార్ చరిత్రను ఎంతో సరళంగా, ఆసక్తికరంగా, కదిలించే విధంగా వ్రాశారు శ్రీ ఎ. పండరీనాథ్. ఈ పుస్తకం అందరి మన్ననలను పొందుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు.

రచయిత కృషిని నేను మనసారా అభినందిస్తున్నాను. వారిలోని పట్టదల, పరిశ్రమ, యోగ్యత ముందు తరాల వారికి తప్పకుండా ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

K Lakshman B.

తేది. 2-6-2010

అశోక్‌నగర్, హైద్రాబాద్.

- ***ఆచార్య కొండా లక్ష్మణ్ బాపూజీ***

★ ☆ ★

**G. KISHAN REDDY,** MLA

- BJP State President A. P.
- BJP Floor Leader - A.P. Assembly,
- International Chairman - WYCAT (World Youth Council Against Terrorism)
- National Former President, BJYM (BJP Youth Wing)
- Member, Public Accounts Committee, A.P. Assembly.



Office : # 205 MS-II, Old M.L.A. Quarters, Hyderguda, Hyderabad -29 (A.P.)
Tel Fax : +91-40-2323 7733
+91-40-6610 1717 Ext. 5205
+91-94905 99997
e-mail : gkishanreddy@yahoo. com
Website : www.kishanreddy.com
Date :..........................................



# హైదరాబాద్ భగత్ సింగ్
# నారాయణ రావు పవార్

ఆనాడు మహా ఘనత వహించిన నిజాం, మీర్ ఉస్మాన్ అలీఖాన్ పేరు ఎత్తడానికే ఎంతో ధైర్యంకావలసి వచ్చేది. ఆయనను చూడడ మంటేనే హైదరాబాద్ ప్రజలు ఎంతో గొప్పగా భావించేవారు. అసలు ఆ కాలంలో నిజాం పేరు చెబితేనే ప్రజలు జడుసుకువేవారని విన్నాను నేను. ఆయన ఒక కరుడు గట్టిన నియంత. నిరంకుశ పాలకుడు. ప్రపంచంలోని ధనవంతుల్లో ఒకడని ఆయనకు పేరుంది.

అలాంటి గొప్ప వ్యక్తి, నియంతపై ఒక సామాన్యమైన వ్యక్తి బాంబు వేయడమంటే ఎంతో సాహసం కావాలి. తెగింపు కావాలి. అంతటి ధైర్యసాహసాలు నిండిన వ్యక్తే స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావు పవార్.

వరంగల్ పట్టణంలోని ఒక రైల్వే హమాలీ ఇంట్లో పుట్టి పేదరికంలోనే జీవితం వెలిబుచ్చిన ఒక సామాన్యమైన వ్యక్తిలో ఇంతటి సాహసం, తెగింపు నెలకొనడం సామాన్యమైన విషయం కాదు. ఆయన పేదరికంలో మెదిలినా గొప్ప ఆశయాలను అలవర్చుకున్నారు. ఆయనలోని దృఢ నిశ్చయం, తెగింపు చాలా గొప్పవి.

నిరంకుశ పాలనతో తన ప్రాంత ప్రజలను నానా హింసలకు గురి చేస్తూ, ప్రజలను బానిసల కంటే హీనంగా పరిగణిస్తూ హిందువులను నీచంగా చూస్తూ హిందూ మతానికే ద్రోహం తలపెట్టిన నియంత నిజాం.

నారాయణరావు పవార్ దేశ భక్తుడు. కర్మ వీరుడు - గొప్ప ఆర్యసమాజ్ కార్యకర్త. హిందువులను బలవంతంగా ఇస్లామ్ మతంలోకి మార్చి వేసే నిజాం కుటిల,



దుష్ట నీతికి బాగా చలించి పోయిన వ్యక్తి. మచ్చలేనిది ఆయన వ్యక్తిత్వం. ఆయన కర్మవీరుడు. ప్రపంచ విప్లవకారుల జాబితాలో చేరవలసినవాడు.

ఆయన ఒక యోగి లాంటి వారు. భవిష్యత్ జీవితాన్ని ఏ మాత్రం ఆలోచించక అప్పటి పరిస్థితులనే తలచుకొన్నారు. తమ ప్రాంత ప్రజల క్షేమం గూర్చి ఆలోచించారు.

ఇంతటి గొప్ప వీరుని, త్యాగశీలిని గూర్చి ఈ నాటి తరం వారికే కాదు పెద్ద తరాల వారికి కూడా తెలియక పోవడం ఎంతేనీ శోచనీయం.

ఇంతటి వీరుడు మరో దేశంలో పుట్టివుంటే, మరో ప్రాంతానికి చెందిన వాడై ఉంటే ఈ వీరునికి ఎంతటి ఘనకీర్తి వచ్చేదో! ప్రజలు ఎంత గొప్పగా నీరాజనాలు సమర్పించుకునేవారో!

ఈ లోటును తీర్చడానికే, ఇంతటి గొప్ప స్వాతంత్ర్య సమరవీరుని, త్యాగధనుని జీవిత విశేషాలను వెలుగులోకి తీసుకురావడానికే నా చిన్న నాటి గురువుగారు, ప్రముఖ రచయిత శ్రీ ఎ. పండరీనాథ్‌గారు ఎంతో శ్రమించి ఈ పుస్తకాన్ని రచించారు.

శ్రీ నారాయణరావు పవార్ నివాసం నా నియోజక వర్గం అంబర్‌పేటకు చెందిన న్యూ నల్లకుంట కావడం నాకు గర్వకారణంగా ఉంది. అలా వారి పట్లనాకు ప్రత్యేకమైన అభిమానం, గౌరవం కూడా ఉన్నాయి.

కాగా ఈ ఉద్యమంలో స్వయంగా పాల్గొన్న పెద్దలు గౌరవనీయులు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు ఆచార్య కొండాలక్ష్మణ్‌బాపూజీ గారు ఈ పుస్తకానికి ముందు మాట రాయడం ఎంతో సముచితంగా, నిండుగా వుంది.

మా గురువుగారు శ్రీ ఎ. పండరీనాథ్‌గారు రిటైర్ ఉపాధ్యాయుడు. ఆర్థిక పరిస్థితి అంత బాగా లేనివారు. పెన్షన్ పైనే ఆధారపడి ఉంటారు. కాని కార్యదీక్ష, పట్టుదలతో ఇలాంటి పరిస్థితిలో కూడాసాహసించి ఎన్నో పుస్తకాలను వెలువరిస్తున్నారు. ఇప్పుడు ఆయన వయస్సు 74 సంవత్సరాలు. అంటే విశ్రాంతి తీసుకోవలసిన వయస్సు. కాని వారు నాకు పని చెయ్యడానికి సమయం సరిపోవడం లేదంటారు. అలా అలుపెరుగని సాహితీ మూర్తి ఆయన. హైదరాబాద్ స్వాతంత్ర్య సమర చరిత్రను, నారాయణరావు పవార్ జీవిత విశేషాలను ఎంతో హృద్యంగా, సహజంగా పాఠకులకు అందించిన రచయిత శ్రీ ఎ. పండరీనాథ్ గారిని నేను మనసారా అభినందిస్తున్నాను!

తేది. 25-6-2010
స్థలం : హైదరాబాద్.

జి. కిషన్ రెడ్డి
ఎం.ఎల్.ఏ.
బి.జె.పి. రాష్ట్ర అధ్యక్షులు

★ ☆ ★

# నా మాట



దేశరక్షణకుగాని, ధర్మ రక్షణకు గాని నిస్వార్థమైన ఆత్మత్యాగమే అవసరం. దేశానికే ముప్పు వాటిల్లినప్పుడు, దేశీయుల మాన ప్రాణాలు ప్రమాదంలో చిక్కుకున్నప్పుడు ఆత్మత్యాగం వల్ల ప్రాణాలర్పించడానికి సాహసించిన మహానుభావులే నిజమైన మానవులు. వారే దేశ భక్తులు. అలాంటి వారి త్యాగ ఫలితంగానే వీరులుద్భవిస్తారు.

వట్టిమాటలు కట్టిపెట్టి గట్టిమేల్ తలపెట్టిన వారే త్యాగ ధనులు. భారత స్వాతంత్ర్య సంగ్రా మంలో భగత్‌సింగ్ ప్రాణాలకు తెగించి కౌన్సిల్ హాల్‌లో బాంబు విసిరి పట్టుబడ్డాడు. ఉరితీయబడ్డాడు. గొప్ప దేశ భక్తుడుగా కీర్తించబడ్డాడు.

హైదరాబాద్ రాష్ట్రంలో జరిగిన స్వాతంత్ర్య సమరం అలాంటి త్యాగధనులను, వీరులను, సాహసవంతులను సృష్టించింది. నారాయణ రావు పవార్ వారందరిలో తలమానికమని నిస్సందేహంగా చెప్పవచ్చును. నిజాం నవాబు గద్దెనెక్కిన నాటి నుండి మత దురహంకారంతో, కుచ్చితమైన స్వార్థంతో తన రాచరికపు గద్దెను నిలుపుకోటానికి చేసిన దురంతాలకు అంతులేదు. తన కండ్ల ముందు జరిగే మానభంగాలను, దోపిడీలను, హత్యలను చూసి నారాయణరావు పవార్ హృదయం చలించి పోయింది.

వీటన్నింటికి మూల కారకుడైనవాడు నిజామే. అతన్ని హతమారిస్తే ఈ దురంతాలు ఆగిపోతాయని కృత నిశ్చయంచేసుకొన్నాడు. జీవితం మీద ఆశవదిలి, దేశమాత చరణాలకు చిత్తశుద్ధితో నమస్కరించి జనకంటకుడైన నిజాం మీద బాంబు వేసి దేశాన్ని, ప్రాంతాన్ని నిర్బంధం నుండి విముక్తి చెయ్యడానికి ఉపక్రమించాడు. అయితే నారాయణ రావు పవార్ విసిరిన బాంబు వెంట్రుక వాసిలో గురి తప్పింది. ఇంకా పాపం పండలేదు కాబోలు! నిజాం బతికి బయటపడ్డాడు.

అయితే నారాయణరావు పవార్ పిరికిపందవలె పారిపోలేదు. అతన్ని ఏమి చేయవద్దని నిజాం ఆదేశించాడు. అంటే అతని ద్వారా ఈ సంఘటన వెనక ఉన్న కుట్రను తెలుసుకోవాలన్న దురుద్దేశంతోనే అలా ఆదేశించాడు.



పోలీసుల చేత పడితే రజాకార్లు అతన్ని తునాతునకలుగా నరికి పారేసేవారు. కాని దైవికంగా తప్పిపోయాడు. బతికి బట్ట కడతాడని, నేడు మనమధ్య ఉంటాడని ఎవరూ ఊహించలేదు. ఆయనకు ఉరిశిక్ష పడింది. తరువాత యావజ్జీవ కారాగర శిక్షగా మారింది. ఉరి తీయబడి ఉంటే నేడు ఆయన దేశభక్తాగ్రేసరులలో భగత్ సింగ్ మొదలైన మహాధీరుల కోవకు చెందిన వాడుగా ప్రస్తుతింపబడేవాడు.

అయితే హైదరాబాద్ స్వాతంత్ర్య చరిత్ర మన దేశ చరిత్రలో నిరుపమానమైనది. ఇదో గొప్ప ప్రజా ఉద్యమం. ఈ ఉద్యమం క్రమంగా విస్తరిల్లుతూ వచ్చింది. చివరికి సామాన్య ప్రజలు మామూలుగా వ్యవసాయ కూలీలు కూడా తెగించి ఈ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. సామాన్యులు కూడా బర్చీలు, తుపాకులు చేతబట్టుకున్నారు. కొండలు కోనల్లో రహస్యంగా నివాసాలేర్పరచుకున్నారు. అంతర్జాతీయ స్థాయిలో ఇలాంటి ఉద్యమం ప్రపంచంలో మరెక్కడా జరుగలేదని చరిత్ర కారులే అన్నారు.

ఇంతటి గొప్ప ఉద్యమంలో తన వంతు పాత్రను ఎంతో సమర్థవంతంగా పోషించారు. ప్రాణాలకు తెగించి ధైర్యంగా పోరాడారు నారాయణ రావు పవార్. ఇప్పుడు పండుటాకులా కనబడినా నిండు దర్పంతో ఉన్న ఈ వ్యక్తి అంతటి ఘనత వహించిన నిజాంపైనే బాంబు వేశాడంటే, మృత్యువులోగిలి వరకూ వెళ్ళి తిరిగి వచ్చాడంటే ఎవరూ నమ్మరు.

అతి సాదా సీదాగా హైదరాబాద్ నల్లకుంటలోని ఓ చిన్న ఇంట్లో ఉంటున్న ఈ దేశ భక్తుని గూర్చి చాలా మందికి తెలియదు. ఈయన ఇంటి చుట్టు పక్కల వారికే తెలియదు ఈయన ఇంత త్యాగధనుడు, ధైర్యశాలి అని.

మరో వారంలో ఉరితీస్తారనగా సర్దార్ పటేల్ ఆదేశాలతో భారత సైన్యాలు నిజాంను లొంగదీసుకోవడంతో బతికి బయటపడ్డాడు. తదనంతర కాలంలో స్వతంత్ర్య భారత పాలకుల అధికారుల నిర్లక్ష్యానికి గురై తగిన సత్కారానికి నోచుకోలేక పోయారు.

## కృతజ్ఞతలు

ముందు మాట రాసి ఇచ్చిన పెద్దలు గౌరవనీయులు, ప్రముఖ స్వాతంత్ర్య యోధులు, మాజీ మంత్రివర్యులు ఆచార్య కొండా లక్ష్మణ్ బాపూజీ గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను,

అభినందన వాక్యాలు రాసి ఇచ్చిన నా ప్రియ శిష్యుడు, అత్యంత అభిమాని, ఆత్మీయుడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర బిజెపి అధ్యక్షులు, ఎమ్ఎల్ఏ శ్రీ జి. కిషన్ రెడ్డి గారికీ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

నా రచనా వ్యాసంగానికి నిరంతరంగా సహకరిస్తున్న సుప్రసిద్ధ రచయిత, స్వాతంత్ర్య సమరయోధులు డా॥ ఎం.ఎల్. నరసింహారావుగారికీ

మిత్రులు, ప్రముఖ జర్నలిస్ట్ శ్రీ జి. వెంకటరామారావుగారికీ

పుస్తక ప్రచురణకు అన్ని విధాలా సహకరించిన ఆత్మీయులు శ్రీమారం రాజు రామచంద్రరావుగారికీ,

పుస్తకాన్ని ప్రచురించిన ఆత్మీయ మిత్రులు శ్రీ సి. నర్సిరెడ్డి, శ్రీ ఎల్. నారాయణరెడ్డి గారలకూ.

ముఖ చిత్రాన్ని ఆకర్షణీయంగా తయారు చేసిన మిత్రులు శ్రీ బదరీనాథ్ గారికీ,

నాకు సహకరించిన నారాయణరావ్ పవార్ గారికీ, వారి పుత్రులు శ్రీ సుధాకర్ రావ్ పవార్ గారికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

**ఎ. పండరీనాథ్**

**- రచయిత.**

★ ☆ ★



# కలం వీరుడు షోయబ్



ఆనాడు షోయబ్ ఓ గొప్ప పత్రికా రచయిత.

"పగటి ప్రభుత్వం - రాత్రి ప్రభుత్వం" పేరుతో ఆయన రాసిన సంపాదకీయం నిజంగా ఆనాటి సంఘటనలకు అద్దం పట్టింది. నిర్భయంగా యదార్థాన్ని ప్రజలకు చూపుతూ షోయబ్ "ఇమ్రోజ్ (పత్రిక)ను ప్రజల వాణిగా తీర్చిదిద్దాడు. కాసీం రజ్వీ ఒక సారి ఉపన్యాసంలో ఆసఫియా ధ్వజం ఎర్రకోటపై ఎగురుతుందని బీరాలు పలికారు. ఈ విషయాన్ని ఖండిస్తూ షోయబ్ ఇమ్రోజ్‌లో చేసిన వ్యాఖ్యలను తట్టుకోలేక పోయారు. యువకుడైన షోయబ్ రజాకార్లను ధైర్యంగా ఎదురించారు.

ముస్లింల ఐక్యతను విచ్ఛిన్నం చేసే శక్తులు సజీవంగా ఉండడానికి వీలులేదు. భారత ప్రభుత్వ ఏజెంట్లుగా ఉంటూ మా సమైక్యతను ధ్వంసం చేయాలనే కీలు బొమ్మల చేతులు ఉండడానికి వీలులేదు"అని అంటూ ఆక్రోశాన్ని వెలిగక్కాడు.

1948 ఆగస్టు 21న రజాకార్లు, పత్రికా కార్యలయం నుండి ఇంటికి వెళుతున్న షోయబుల్లాఖాన్‌ను దారుణంగా కాల్చి చంపారు.

అలా దేశభక్తి, వృత్తి, ధర్మం, అంకితభావానికి షోయబ్ బలైపోయారు.

---

# నిర్బంధాలకు జంకని వీరుడు



విద్యార్థి దశలోనే 1938లో హైదరాబాద్ సంస్థానంలో జరిగిన వందే మాతరం ఉద్యమం సందర్భంగా హైదరాబాద్ వైద్య కళాశాలలో సమ్మెను నిర్వహించారు. ఆంధ్రమహాసభ కార్యకర్త. 1940 నుంచి భారత కమ్యూనిస్టు పార్టీ సభ్యులు.

జమీందారీ, జాగిర్దారీ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొన్నందుకు నిజాం ప్రభుత్వం 1946 నవంబర్ 28న అరెస్టు చేసి జైల్లో పెట్టింది. 1947 మే 7న జైలు నుంచి తప్పించుకున్నారు.

అఖిల భారత్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను స్థాపించి దానికి ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు.

**- డా॥ రాజబహదూర్ గౌర్**

---

# ఆనాటి పోరాటమే అందరి ధ్యేయం



భారత దేశం స్వాతంత్ర్యం పొందిన నాటికి సంస్థానాల్లో అనుకున్నంత చైతన్యం లేదు. నాయకత్వమూ లేదు.

కాని సంస్థాన ప్రజల్లో సంస్థానాధీశులకు అనుగుణంగా అఖిల భారత సంస్థాన ప్రజామండలి అధ్యక్షులు షేక్ అబ్దుల్లా, హైదరాబాద్ కాంగ్రెస్ నాయకులు స్వామీ రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణారావు, కె.వి. రంగారెడ్డి వంటి పెద్దలు నిజాం రాష్ట్రం భారతయూనియన్‌లో కలిసిపోవాలనే ప్రయత్నాలు విరివిగా చేశారు. నిజాం సంస్థానంలో అధిక సంఖ్యాకులుగా హిందువులు ఉన్నచోట వారి మనోభావాలకువ్యతిరేకంగా ఉర్దూ ఉంచబడింది. ఉద్యోగాలు ఉర్దూభాషనేర్చుకున్నవారికీ, ముస్లింలకే ఇచ్చేవారు. వెట్టిచాకిరీ విధానాన్ని అన్ని పార్టీలు కలిసి వ్యతిరేకించాయి.

దీన్ని సాధించడానికి ఆంధ్ర మహాసభ, కాంగ్రెస్,ఆంధ్ర జాతీయపక్షం, ఇతర వామపక్షాలు ఏకోన్ముఖులుగా పోరాటం సాగించాయి.

**- ఎం.ఎస్. రాజలింగం**

మాజీమంత్రి

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు



# తెలుగు భాషను అవమానిస్తే భరించలేకపోయా!



1947 ఏప్రిల్‌లో సికింద్రాబాద్‌లోని కర్బలా (ఇప్పుడు లేదు) మైదానంలో జరిగిన ముస్లిం సభలో పాకిస్తాన్‌కు అనుకూలంగా జిన్నా ప్రసంగించారు. ఈ సందర్భంలో కొందరు తెలుగు భాషను చులకన చేస్తూ అవమానకరంగా వ్యవహరించారు. దీనిని మేం సహించలేక పోయాం. యాసిడ్ బాంబులతో దాడి చేశాం. అప్పుడు సికింద్రాబాద్‌లో జరిగిన అలజడిలో ఎందరో చనిపోయారు.

ఆనాటి సంఘటన ఇప్పటికీ మరచిపోలేక పోతున్నాను.

**- నర్రా మాధవరావు**

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు

---

# క్లాక్ టవర్ పై జెండా రెపరెపలాడిన వేళ!



1947 ఆగస్టు 15వ తేదీ, దేశమంతా స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో మునిగి పోయింది. హైదరాబాద్‌లో జెండా ఎగుర వేయకుండా నిజాం కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశారు.

సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషానిలయం పక్కన చిన్న మడిగెలో తాళాలు బాగు చేసేనేను మాత్రం మువ్వన్నెల జెండాను భాగ్యనగరంపై ఎలాగైనా ఎగుర వేయాలని సంకల్పించుకున్నాను. సెప్టెంబర్ ఒకటో తారీఖున రాత్రి సుల్తాన్ బజార్ క్లాక్ టవర్ వద్దకు వెళ్లి మెట్లు ఎక్కే దగ్గర ఉన్న అలీఘర్ తాళం పగుల గొట్టి పైకి వెళ్లి జెండా ఎగురవేశాను.

మరునటి ఉదయం జెండా రెపరెపలాడుతుంటే నేను, నాతోపాటు నగరవాసులందరూ పులకించి పోయారు. మువ్వన్నెల జెండా చూసిన ఎనిమిది మంది పోలీసులు సెల్యూట్ చేసి అనంతరం దానిని దింపేశారు. మమ్మల్ని అరెస్టు చేసి జైల్లో పెట్టారు. అదో మరపురాని అనుభూతి.

**- నరసింహులు**

స్వాతంత్ర్య సమరయోధులు

# ఒక మాట

నిజానికి ఇరవయ్యో శతాబ్ది తెలంగాణ సామాజిక చరిత్ర ఒక అద్భుతమైన గని. తెలంగాణా తనదైన భాషాసంస్కృతుల కోసం, వనరుల మీద ఆధిపత్యంలో, అనుభవంలో సమానత్వం కోసం, ఆధునిక విద్యకోసం, వెట్టి చాకిరీ నుంచి విముక్తి కోసం, ఆత్మ గౌరవం కోసం, అస్తిత్వంకోసం, స్వయం నిర్ణయాధికారం కోసం పోరాడినప్పుడు ఆ పోరాటాన్ని అద్భుతమైన ప్రజా సంచలనాలుగా ప్రకటించిన చరిత్ర ఇరవయ్యో శతాబ్ది తెలంగాణాది. ఆ చరిత్రలో ఉద్యమనేతలుగా, చోదక శక్తులుగా, కార్యకర్తలుగా, నాయకులుగా, నిర్మాతలుగా, నిర్ణేతలుగా ఉన్న వాళ్ల జీవిత కథనాలు ఎన్ని చదివినా ఇంకా తెలుసుకోవలసింది మిగిలే ఉంటుంది.

ఇలాంటి వైభవోజ్వల గాధలకు ఆలవాలమైన ఇరవయ్యో శతాబ్ది తెలంగాణ గురించి ఇప్పటికే అనేక మంది తమ జ్ఞాపకాలు, అనుభవాలు, స్మృతులు, జీవిత చరిత్రలు రాశారు.

ఆంధ్రజన సంఘం, ఆర్యసమాజం, గ్రంథాలయోద్యమం, స్టేట్ కాంగ్రెస్, ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీ, విద్యార్థి, యువజన ఉద్యమం, పౌరహక్కుల ఉద్యమాలు, రచయితల, కవుల కృషి.-

సామాజిక సంచలనాలలో పాల్గొన్న ఉద్యమ నాయకుల, కార్యకర్తల అందరి కృషి అద్వితీయమైనదే.



ఇందులో...

# ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు



కె.ఎం. మున్షీ



పాగా పుల్లారెడ్డి



కె.వి. కేశవులు



# 1. హైదరాబాద్ సంస్థానంలో తెలంగాణ

భారతదేశంలోని దేశీయ రాజుల పరిపాలనలో ఉన్న సంస్థానాలన్నింటిలోనూ హైదరాబాద్ సంస్థానం చాలా పెద్దది. దీని వైశాల్యం 82,698 చ.మైళ్లు. ఇందులో తెలంగాణ భూ భాగం 41,502 చ.మైళ్లు.

బ్రిటిష్ ఇండియాలోని ఏ సంస్థానానికీ లేని అధికారాలు, సదుపాయాలు ఈ స్టేటుకు ఉండేవి. స్వతంత్ర కరెన్సీ (హాలీ రూపాయలు అనేవారు-అప్పటి కరెన్సీని) తంతి, తపాలా, రైల్వే శాఖలు కూడా ఈ ప్రభుత్వం ఆధీనంలో ఉండేవి.

హైదరాబాద్ నగరం చుట్టూ ఉన్న అత్రాఫ్ బల్దా జిల్లా మొత్తం ఆదాయం నిజాం స్వంత ఖర్చులకు తీసుకునేవారు. దీనిని "సర్ఫెఖాస్" అనేవారు. ఇది కాక ఆయనకు వివిధ జిల్లాలలో ఇంకా కొన్ని సర్ఫెఖాస్ జాగీర్ గ్రామాలు కూడా ఉండేవి.

సంస్థానమంతటా చిన్నా, పెద్ద కలిపి దాదాపు 11 వందల మంది జాగీర్దార్లు, సంస్థానాధిపతులు, దేశ్‌ముఖ్, దేశ్ పాండ్యాలు ఉండేవారు. ఈ జాగీర్దార్లలో చాలా మంది హైదరాబాద్ నగరంలో విలాస జీవితం గడుపుతూ కాలక్షేపం చేసేవారు. వీరంతా తమ జాగీర్లలో సర్వాధికారులు. వీరి తరపున వారి ఉద్యోగ బృందం గ్రామాలలో నిరంకుశాధికారం చెలాయించేవారు.

అధిక పన్నులు, వెట్టి చాకిరీతో ప్రజల జీవితం దుర్భరంగా ఉండేది. రైతులను నిలువు దోపిడీ చేసేవారు. గ్రామీణ ప్రజలపై నిజాం ప్రభుత్వ ఉద్యోగులు, వారి తాబేదార్లు చేసే అఘాయిత్యాలు, అమానుష కృత్యాలు, అత్యాచారాలకు అంతే లేదు.

ఇక సంస్థానంలో పౌరహక్కులు మృగ్యం. సభలు, సమావేశాలు జరుపుకోవటానికి కూడా ప్రభుత్వ అనుమతి అవసరమయ్యేది. వాక్ స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం ఏ మాత్రం ఉండేవి కావు. ఇలాంటి అంధకారంలో ఆనాటి ప్రజలున్నారు.

ప్రభుత్వ అధికార భాష, బోధనా భాష ఉర్దూయే. ప్రాథమిక పాఠశాలల్లో కూడా ఉర్దూయే బోధనా భాషగా ఉండేది. మాతృభాషలో విద్యాభ్యాసానికి అవకాశాలుండేవి కావు.

**స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్**

ఇక తెలంగాణా ప్రాంతంలో తెలుగువారి పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉండేది. ప్రభుత్వ ఉద్యోగాలలో తెలుగువారి సంఖ్య బహు స్వల్పం. అక్షరాస్యుల సంఖ్య నూటికి నాలుగు శాతం మాత్రమే.

రాజధాని అయిన హైదరాబాద్ నగరం తెలుగు ప్రాంతమైన తెలంగాణాలో చేరి ఉన్నప్పటికీ తెలుగు వాళ్లెవ్వరూ ఉన్నత పదవుల్లో కనిపించే వారు కాదు.

**ఆనాటి భౌగోళిక సాంఘిక పరిస్థితులు :**

అప్పుడు హైదరాబాద్ సంస్థానం 16 జిల్లాలు, 4 సుబాలుగా విభజింపబడింది. మీర్ ఉస్మాన్ అలీఖాన్ అసఫ్ జహీవంశానికి చివరి రాజు, అంటే ఏడవ రాజు.



**మీర్ ఉస్మాన్ ఆలీ ఖన్**

ఈయన సింహాసనం మీదకి వస్తూనే రాష్ట్ర పరిస్థితులను తెలుసుకునే మిషతో మొత్తం రాష్ట్ర పర్యటన జరిపారు. రాజు పర్యటన సందర్భంగా ప్రతిచోటాఎన్నో వింతలు జరిగాయి ఆనాడు. ఆయన వెళ్లిన ప్రతి జిల్లాలోనూ, ప్రతి సంస్థలోనూ స్థానిక అధికార్లు రాజుకు కానుకలు సమర్పించుకోడానికి నజరానాలు వసూలు చేసేవారు. (నజరానాలు అంటే కానుకలు) వారు ఇష్టం వచ్చి నట్లుగా నజరానాల కింద డబ్బు వసూలు చేసేవారు. ఎక్కువ నజరానాలు చెల్లించుకున్న వారు నిజాం ప్రభువుకు దగ్గరయ్యేవారు. అలాంటి వారు కింది స్థాయి నుండి పైకి తొందరగా వచ్చేవారు.

ప్రభుత్వ ఉద్యోగుల నియామకం, ప్రమోషన్ల గురించి నజరానాలు బాగా తోడ్పడేవి. నజరానాయే ఆనాటి మెరిట్. సమర్థత. అర్హతలకు స్థానం లేదు.

కొందరు ఉద్యోగులు ఫర్మాన్‌ల ద్వారా నియమింపబడేవారు. వారు నేరుగా రాజుకే బాధ్యులు. రాజుకు డబ్బు చెల్లించి ఉద్యోగాలు సంపాదించుకునేవారు.





ఇలా ఆనాడు హైదరాబాద్ నగరంలో కూడా నిజాం నజరానాల పేరుతో బాగా డబ్బు వసూలు చేశారు. నిజాం ప్రభువు జన్మ దినం పండగ రోజున ఆహ్వానితులంతా ప్రభువుకు నజరానాలు చెల్లించుకునేవారు.

పోతే ఏడవ నిజాం తనకు డబ్బు కావలసి వచ్చినప్పుడు, ఇష్టం వచ్చినప్పుడు, ఏ అమీరో లేక జాగీర్దారు దేవిడీకో వెళ్లి నజరానా పేరిట డబ్బు వసూలు చేసుకొని వచ్చేవారు. అయితే ఆ కుటుంబం యజమానే కాక కుటుంబంలోని ఆడ మగ వారు, పిల్లలు కూడా నజరానాలను చెల్లించేవారు. నిజాం రాజు పరిపాలనలో ఓ వింత పద్ధతి ఇది.

ఆనాడు సమాజంలో ఎంతో దుర్భరమైన పరిస్థితులుండేవి. మూఢ నమ్మకాలు, అంధ విశ్వాసాలు బాగా ప్రబలిన రోజులవి. కుల మత భేదాలు బాగా పాదుకొన్న రోజులవి. అంతే కాదు భాషలో కూడా ఎంతో భేదం కనిపించేది. సుమారు ఎనభై అయిదు సంవత్సరాల క్రితం తెలంగాణా ప్రాంత సాంఘిక స్థితి గతులను నెమరేసుకుంటే, ఈనాటి వారికి ఎంతో వింత అనిపిస్తుంది.

ఆ రోజుల్లో ప్రయాణ సాధనాలు చాలా తక్కువ. వాహనాలు చాలా అరుదు. ఆనాడు టాంగా, జట్కా, బగ్గీ (గుర్రపు బండి) అనే పదాలను చెబితే ఈ నాటి వారు విస్తు పోయి చూస్తారు.

కాగా ఆనాటి హైదరాబాద్ రాష్ట్రానికి కొన్ని వింతలున్నాయి. ఈ రాష్ట్రంలో అప్పుడు హాలీ (చార్‌మినార్ సిక్కా (నాణెం) రూపాయలు చెలామనిలో ఉన్నాయి. 1918 నుండి కాగితపు కరెన్సీ నోట్ల పద్ధతి కూడా చెలామని లోకి వచ్చింది. 1946లో 44 కోట్ల 44 లక్షల రూపాయల కరెన్సీ నోట్లు 1 రూపాయి నుంచి 100 రూపాయల వరకు, చలామనిలో ఉన్నాయి.

వీటితో పాటు ఆనాడు హైదరాబాద్ రాష్ట్రంలో కల్దారు రూపాయలు (ఇండియా గవర్నమెంటు రూపాయలు లేక బి.జి. కరెన్సీ) కూడా న్యాయ సమ్మత ద్రవ్యంగా చెలామనీలో ఉంది.

ఆ రోజుల్లో ముద్దపైసలనే రాగి పైసలుండేవి. హాలీ రూపాయలను మారిస్తే 96 పైసలు వచ్చేవి. ఇది ఆనాటి నిజాం ప్రభుత్వపు సిక్క-స్వతంత్ర భారతంలో నిజాం రాజ్యం విలీనమయ్యే వరకు కూడా ఈ రూపాయి వాడుకలో ఉండింది. కాగా కల్దారు రూపాయి నిజాం ష్ట సరిహద్దు ప్రాంతాలలోనే కాక హైదరాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలలో ఉండే బ్రిటిష్ సర్కారు ఉద్యోగులందరికీ జీతాలు కల్దారు రూపాయలలోనే ఇవ్వబడేవి.

**తపాలా విధానం :**

అప్పటి హైదరాబాద్‌రాష్ట్ర తపాలా విధానం మరొక ప్రత్యేకతను కలిగి వుండేది. బ్రిటిష్ ఇండియా మాదిరి రాష్ట్ర పోస్టాఫీసులుండేవి. క్రమంగా తపాలా కార్యక్రమాలన్నీ సాగుతూ ఉండేవి. వీటితో పాటు రాష్ట్ర ముఖ్య కేంద్రాల్లో భారత ప్రభుత్వ పోస్టాఫీసులు కూడా ఉన్నాయి.

**సాంఘిక పరిస్థితులు :**

ఆ కాలంలో కులమతాలు, భేదాలు ఉన్నాయి. హిందువులు తమతమ ఆచారాలు పటించేవారు, వర్ణాంతర భోజనాలు చేసేవారు కాదు.

మధ్య తరగతికి చెందిన ముస్లిం మరియు హిందూ స్త్రీలు కూడా పరదా పద్ధతి అవలంభించేవారు. అప్పుడు వెలాటారు కార్లు, బస్సులు, ఇప్పటిలా ద్విచక్ర వాహనాలు లేవు. రెండు ఎట్లు కట్టిన "షెక్రాంబండ్లు" ఒక్క గుర్రం కట్టిన ఝట్కా, టంగా బండ్లు, ఒక్క గుర్రం లేక రెండు గుఱ్ఱాలు కట్టితోలే బగ్గీలు ఉండేవి.

పెద్ద పెద్ద జాగీరు ప్రభుత్వ పెద్ద ఉద్యోగస్తులు, శ్రీమంతులు బగ్గీలు వాడేవారు. బోయలు మోసే మేనాలు కూడా బాగా వాడే వారు.

ఆకాలంలో ప్రజలలో ఎలాంటి చైతన్యం లేదు. చదువు కొన్న వారి సంఖ్య చాలా తక్కువ.

**పత్రికలు :**

ఆ కాలంలో రెండు ఉర్దూ దిన పత్రికలు "ముషీర్ దక్కన్" "సఫీఫ" ఉండేవి. సికింద్రాబాద్ నుండి "బులెటిన్" అనే ఇంగ్లీషు పత్రిక వెలువడేది. తెలుగులో కానీ, మరాఠీ, కన్నడంలో కానీ పత్రికలు అసలే లేవు. అసలు ఉన్నపత్రికలు కూడా చదివే వారే కాదు.

అప్పుడు హైదరాబాద్ రాష్ట్రాన్ని తెలంగాణా, మరాఠ్వాడా, కర్నాటక ప్రాంతాలుగా పేర్కొన్నారు. అత్రాఫ్ బల్దా నిజామాబాద్, మెదక్, మహబూబ్‌నగర్, నల్గొండ, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ ఇల్లాలు - మారాఠ్వాడా ప్రాంతంలో ఔరంగాబాద్, బీడ్, నాందేడ్, పర్భనీ జిల్లాలు - కర్ణాటక ప్రాంతంలో గుల్బర్గా, బీదర్, రాయచూర్, ఉస్మానాబాద్ - ఉండేవి. కోటీ పై చిలుకు తెలుగు వారు, నలభై లక్షల మంది మరాఠీలు, ఇరవై లక్షల మంది కన్నడీలు, ఇరవై లక్షల పై చిలుకు ఉర్దూ, హిందీ మాట్లాడేవారు ఉండేవారు. ★☆★

**నిజాంపై బాంబు దాడి**



20వ శతాబ్దపు తొలి రోజులలో నిజాం సంస్థానం వెలలేని సంపదలకు, వెట్టి బానిసలకు ప్రపంచ వ్యాప్త గుర్తింపు పొందింది. చివరి నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ ప్రపంచంలోనే అత్యధిక ధనవంతునిగా రికార్డునెలకొల్పాడు. ★

**ప్రతి పౌరుడు పన్ను చెల్లించాల్సిందే :**

ప్రతి పౌరుడు సర్కారుకు ఇంత పెన్ను చెల్లించాలని నిర్ణయించేవారు. దానిని వసూలు చెయ్యడానికి అతనిని పలు విధాలుగా బాధలు పెట్టేవారు. చిత్ర హింసలకు గురి చేసేవారు.

చెవులకు బరువులు కట్టడం,చాతిపై పెద్ద బండలుపెట్టడం, కాగే నూనెలో వేళ్లు ముంచడం ఆనాడు సాధారణమైన శిక్షలు. బాధలకు తాళ లేక వారు పెట్టే ఆక్రందనలు వాటిని అమలు జరిపే వారి రాక్షస ప్రవృత్తిని సూచిస్తాయి.

ఆనాడు పాలక వర్గాలైన జాగీర్దార్లకు హక్కులు తప్ప బాధ్యతలు లేవు. పాలితులు అంటే ప్రజల పిల్లలకు చదువులు, వారి రోగాలకు మందుల మాటలు అటుంచి వ్యవసాయ అభివృద్ధికి అవసరమైన సాగునీటి వనరులను, తాగునీటి సౌకర్యాలను సైతం కల్పించలేదు.

**ఫ్యూడల్ వ్యవస్థ :**

ఇక ఈ మధ్య యుగపు ఫ్యూడల్ నిజాం పరిపాలన బ్రిటిష్ రాజ్య పతనావస్థతో ఇస్లాం రాజ్య మతోన్మాదం కూడా తోడైంది. దీంతో ప్రజా జీవనం మరింత నరకప్రాయమైంది. బ్రిటిష్ ఇండియాలోని వారికే పౌరహక్కులు లేవంటే నిజాం రాష్ట్రంలోని ప్రజలు మనుషులే కాని పరిస్థితి నెలకొంది.

హైదరాబాద్ రాజ్యంలో ముస్లింల ఆధిపత్యం (ముస్లిం ఏ ఖై-దర్) అనన లక్ష్యంతో "మజ్లిస్-ఏ-ఇత్తెహాద్-ఉల్-ముస్లమీన్" (ఎం.ఐ.ఎం) 1929లో ఏర్పడింది.ముస్లింలు పాలకులు - వారు హైదరాబాదు రాష్ట్రంలోని ఇతర ప్రజలను పరిపాలించడానికే జన్మించారు అన్న సూత్రం ముస్లింల మనోభావాలను రెచ్చగొట్టే అత్యధిక శాతం ముస్లిం ప్రజలను తమవైపు తిప్పుకోవడంలో పార్టీ సఫలమైంది.

హిందూ సమాజంలో అంటరాని వారుగా ఉన్న అట్టడుగు వర్గాల ప్రజలను సామాజిక గౌరవం, రాజకీయ హక్కులు, ఆర్థిక సహాయంపేరిట ప్రలోభపెట్టి సామూహిక మత మార్పిడులకు శ్రీకారం చుట్టారు. 1938 నాటికి ఈ సంస్థ దాదాపు 12 వేల మందిని ముస్లింలుగా మార్చి వేసినట్లు అధికారిక లెక్కలు చెప్పాయి.

★☆★

**స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్**

# ౨. ఆనాటి సాంఘిక పరిస్థితులు

బ్రిటిష్ ఇండియా సంస్థానాల్లో వైశాల్య పరంగా పెద్దదైన నిజాం రాజ్యం ఆర్థికంగానూ పటిష్టమైనదే. కానీ ఇక్కడి ప్రజలు మాత్రం అత్యంత దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించసాగారు. అత్యధికంగా వున్న ఓ వర్గం ప్రజల భాష, మత విశ్వాసాలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అణచివేతకు గురయ్యాయి. ఇక్కడ అన్నింటికీ భద్రత కరువైంది. ఆస్తులకే కాదు మాన ప్రాణాలకు కూడా రక్షణ కరవైంది.

ఆనాడు దేశ ప్రజలందరూ బ్రిటిష్ ముష్కర పాలనకు వ్యతిరేకంగా ఉద్యమాలు చేస్తుంటే ఇక్కడ మాత్రం నిజాం నిరంకుశాధికారాన్ని ప్రశ్నించాల్సి వచ్చింది. ఇక్కడి ప్రజలు అటు బ్రిటిష్ వారితోనూ ఇటు నిజాం వ్యతిరేకంగానూ పోరు సలుపవలసి వచ్చింది.

మత స్వాతంత్ర్యం కోసం ఆర్య సమాజం, పౌర హక్కుల కోసం సివిల్ లిబర్టీస్ యూనియన్, బాధ్యతాయుత ప్రభుత్వం కోసం స్టేట్ కాంగ్రెస్ హైదరాబాద్‌లో సత్యాగ్రహం నిర్వహించాయి. 1942 నాటికి క్విట్ ఇండియా నినాదం హైదరాబాద్‌ను కూడా చుట్టుముట్టింది.

కాగా నిజాం సంస్థానంలో ప్రతి ఉద్యమం అఖిల భారత ఉద్యమంగా మారడమో లేదా హైదరాబాద్ సంస్థాన ప్రజలు అఖిల భారత ఉద్యమాల్లో పాల్గొనడమో జరిగేది. ఈ విధంగా తెలంగాణా ప్రజలు చైతన్యవంతులై నిజాం నిరంకుశ పాలనను ఎదుర్కోవడం ప్రారంభించారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమం నాటికి తెలంగాణాలో కాంగ్రెస్ వాదులు, కమ్యూనిస్టులు కలిసి ఆంధ్రమహాసభ పేరుతో ఉద్యమాలను నడిపారు. 10వ ఆంధ్ర మహాసభలో కమ్యూనిస్టు పార్టీ ప్రజా యుద్ధ నినాదం ఆశించిన స్థాయిలో మద్దతు పొందలేక పోయింది. అయినా వారు 1944లో ప్రారంభించిన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలు మారు మూల గ్రామాలకు సైతం విస్తరించాయి.

కుల, మత భేదాలు లేకుండా సామాన్య ప్రజలందరినీ ఏకం చేసింది. పోరాటం సాయుధ పోరుకు ప్రజలను సిద్ధం చేసింది.

నిజాంపై బాంబు దాడి



**పల్లెల్లో వెల్లి విరిసిన చైతన్యం :**

దొరల వెట్టి చాకిరి, అధికారుల లంచగొండితనం, ప్రజా వ్యతిరేక చర్యలపై రావినారాయణ రెడ్డి, ఆరుట్ల లక్ష్మీ నరసింహారెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి దంపతులు, బద్దం ఎల్లారెడ్డి, గట్టెపల్లి మురళీధర్ తదితర కమ్యూనిస్టు నాయకులు ప్రజా ఉద్యమాన్ని నిర్మించారు.

గ్రామాల్లో నిజాం దోపిడీకి ప్రతీకలుగా నిలిచిన పటేల్, పట్వారీలను, వారికి అండగా వచ్చే రజాకార్లను ప్రతిఘటించడం ప్రారంభమైంది. ఊరూరా ఉద్యమం తీవ్రస్థాయికి చేరింది.

"నీబాంచెన్‌దొరా కాల్మొక్కుతా" అనే సామాన్యులు సైతం తుపాకులు పట్టి ఎదురు తిరిగారు. కమ్యూనిస్టుల అండదండలతో ప్రభుత్వంతో పోరాడడానికి కావలసిన ధైర్య సాహసాలు, సాయుధపోరాట తత్వం ప్రజల్లో తీసుకువచ్చారు.

★☆★



స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్

# 3. క్రమంగా వెల్లివిరిసిన చైతన్యం

నిజాం సంస్థానంలో ఎక్కువ శాతం ఉండే తెలుగు వారికి తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికి ఆదరణలేని పరిస్థితి అది. నలుగురు తెలుగు వాళ్లు ఒక చోట కూర్చొని మాట్లాడుకోవడానికి, తెలుగు పుస్తకాలు, పత్రికలు తెప్పించుకొని చదవడానికి హైదరాబాద్ నగరంలో ఒక ప్రదేశమంటూ, ఒక గ్రంథాలయ మంటూ లేదు. ఇలా ఎంతకాలం? ఈ పరిస్థితి ఇలా ఎంత కాలం కొనసాగాలి?

ఇక భరించలేని పరిస్థితి తెలుగు వాళ్లకు వచ్చేసింది. 1901 సెప్టెంబర్ ఒకటో తేదీన హైదరాబాద్ నగరంలో 'శ్రీ కృష్ణ దేవరాయాంధ్రభాషా నిలయం' పేరిట ఒక తెలుగు గ్రంథాలయం స్థాపించబడింది. ఈ సంస్థ వ్యవస్థాపకులలో పాల్వంచ రాజా గారైన పార్థసారథి అప్పారావు బహద్దూర్, కోశారి వెంట్రావు నాయుడు, మైలవరపు నరసింహశాస్త్రి, ఆదిపూడి సోమనాథరావు, రావిచెట్టు రంగారావు, ఆదిరాజు వీరభద్రరావు మొదలైన వారు ముఖ్యులు.

క్రమంగా ఈ గ్రంథాలయం సాంస్కృతిక పునరుజ్జీవనానికి నాంది అయింది. తరువాత హనుమ కొండలో రాజరాజనరేంద్ర ఆంధ్రభాషా నిలయం 1904లో స్థాపించబడింది. ఆ తరువాత వరుసగా తెలంగాణా అంతటా అన్ని జిల్లాలలోను, ముఖ్య పట్టణాలలోనూ ఎన్నో గ్రంథాలయాలు స్థాపించబడ్డాయి.



రావిచెట్టు రంగారావు



మాడపాటి హన్మంతరావు



ఆదిరాజు వీర భద్రరావు

నిజాంపై బాంబు దాడి



తెలంగాణా ప్రాంతంలో గ్రంథాలయాల స్థాపన వల్ల యువకుల్లో మాతృభాషాభిమానం, గౌరవం ఏర్పడ్డాయి.

గ్రంథాలయోద్యమంతో పాటు ఆంధ్రోద్యమానికి కూడా శ్రీకారం జరిగింది. అలా 1922లో ఆంధ్రోద్యమం ప్రారంభమైంది. "ఆంధ్ర జన సంఘం" పేరుతో ఒక తెలుగుసంస్థ స్థాపించబడింది. నిజాం రాజు నిరంకుశాధికారాన్ని సవాల్ చేయటానికి , తెలుగు ప్రజల ఆత్మగౌరవాన్ని నిలబెట్టి వారిలో ఐక్యతను సాధించడానికి స్థాపించబడింది సంస్థ.

ఆ తరువాత తెలంగాణాలోని వివిధ పట్టణాలలోను, గ్రామాలలోనూ ఆంధ్ర జన సంఘాలు స్థాపించబడ్డాయి.

ఆదిరాజు వీరభద్రరావు, నడింపల్లి జానకిరామయ్య, మందుముల నరసింగరావు, బూర్గుల రామకృష్ణారావు లాంటి వారు ముఖ్యులుగా ఉండి ఉద్యమాలను నడిపించారు. 'ఆంధ్ర జన సంఘం' సమావేశాలు హైద్రాబాద్, నల్లగొండ, మధిర, సూర్యాపేటలలో జరిగాయి.

**నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభ :**

తెలంగాణాలో ఆంధ్రోద్యమాన్ని నిర్మించిన ఘనత మాడపాటి హనుమంతరావుకే దక్కుతుంది. క్రమంతా తెలంగాణా అంతటా విజ్ఞాన జ్యోతులు వెలుగసాగాయి. అప్పటి రాజ భాష అయిన ఉర్దూలో మాట్లాడటం ఘనంగా భావించే విద్యావంతులు తమ మాతృభాష తెలుగులో పత్రికలు, పుస్తకాలు తెప్పించుకొని చదవసాగారు. తెలుగులో ఉపన్యసించసాగారు. ఆంధ్ర్యోద్యమ ప్రచారకులైన ఉన్నవ వెంకటరామయ్య, మంత్రి ప్రగడ వెంకటేశ్వరరావు, ఆదిపూడి సోమనాథరావుగారల నిరతర కృషి - సేవాతత్పరతల వల్ల ఈ ఉద్యమానికి బలం చేకూరింది.

**ప్రథమాంధ్ర మహాసభ :**

నిజాం రాష్ట్ర ప్రథమాంధ్ర మహాసభ ప్రసిద్ధ పరిశోధకులు, పండితులు, గోల్కొండ పత్రికా సంపాదకులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన మెదక్ జిల్లా జోగిపేటలో జరిగింది. పంతులుగారు ఎంతో శ్రమపడి ఈ మహాసభను జరుపుకోడానికి అనుమతి సంపాదించారు.

తెలంగాణాలోని 8 జిల్లాల నుంచి ఎందలో కార్యకర్తలు, యువకులు వచ్చి ఈ సభలో పాల్గొన్నారు. అప్పుడు యువకుడైన రావి నారాయణరెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డితో

స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్

సహా పదిహేను మంది సైకిళ్లపై ఆ మహాసభలకు వలంటీర్లుగా వెళ్లారు.

ఆనాటి సభ "ఆంధ్రదేశపు మట్టి అది మాకుకనకమ్ము" అనే గేయంతో ప్రారంభమైంది. ఈ సభలో మొత్తం 32 తీర్మానాలు ఆమోదించారు. అన్నీ సంఘసంస్కరణ, సాంఘిక సంక్షేమం వ్యవసాయాభివృద్ధికి సంబంధించినవే- రాజకీయాలతో సంబంధం లేనివే

ఇదే సందర్భంలో శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారి అధ్యక్షతన ఆంధ్ర మహిళా సభ జరిగింది.

నిజాం రాష్ట్ర రెండవ ఆంధ్ర మహాసభ 1931 మార్చి నెల నల్లగొండ జిల్లా దేవర కొండలో శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతన జరిగింది.


సురవరం ప్రతాపరెడ్డి


బూర్గుల రామ కృష్ణారావు


పులిజాల వెంకట రంగారావు

ద్వితీయాంధ్ర మహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులు ఆనాటిసుప్రసిద్ధ న్యాయవాది పులిజాలవెంకట రంగారావు. ఈ సందర్భంలో జరిగిన ఆంధ్ర మహిళా సభకు శ్రీమతి బూర్గుల అనంత లక్ష్మీదేవి గారు అధ్యక్షత వహించారు.

నగరంలోని విద్యార్థులు, పల్లెల్లోని రైతులు ఆంధ్ర మహాసభల పట్ల ఆకర్షితులై పాల్గొన్నారు.

మూడవ ఆంధ్ర మహాసభ ఖమ్మం పట్టణంలో 1934లో ప్రముఖ న్యాయవాది శ్రీ పులిజాల వెంకట రంగారావు అధ్యక్షతన జరిగింది. సభకు రెండు వేలకు పైగాహాజరైనట్లు చెప్పారు. ఈ సభలో 21 తీర్మానాలు చేయబడ్డాయి. శ్రీమతి ఎల్లా ప్రగడ సీతా కుమారి మహిళా మహాసభకు అధ్యక్షత వహించారు.

నాలుగవ ఆంధ్రహహాసభ 1935లో కరీంనగర్ జిల్లా సిరిసిల్లలో జరిగింది. ఈ సభకు శ్రీ మాడపాటి హనమంతరావు గారు అధ్యక్షత వహించారు. ఆనాటి సభలో ఆయన





మన రాష్ట్ర పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, క్రమశిక్షణతో మెదలుతూ, జాతిమత భేదాలను పాటించక, దేశాభివృద్ధికై మనమంతా పాటుపడాలని సందేశమిచ్చారు.

ఇక్కడ జరిగిన ఆంధ్రమహిళా సభకు శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మ గారు అధ్యక్షత వహించారు.

అయిదవ ఆంధ్ర మహాసభ 1936లో కొండా వెంకట రంగారెడ్డి గారి అధ్యక్షతన మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్‌లో జరిగింది. ఆంధ్రమహిళా సభ శ్రీమతి టి. వరలక్ష్మమ్మ గారి అధ్యక్షతన జరిగింది.


కొండా వెంకట రంగారెడ్డి


మందుముల నరసింగరావు


రావి నారాయణరెడ్డి

ఆరవ ఆంధ్ర మహాసభ 1937 డిసెంబర్‌లో శ్రీమందుముల నరసింగరావు అధ్యక్షతన నిజామాబాద్‌లో జరిగింది.

ఏడవ ఆంధ్ర మహాసభ 1940లో హైదరాబాద్ మల్కాపూర్ మందుముల రామచంద్రరావు అధ్యక్షతన జరిగింది. శ్రీమతి యోగశీలా దేవిగారి అధ్యక్షతన మహిళా సభ జరిగింది.

ఎనిమిదవ ఆంధ్రమహాసభ 1941లో నల్లగొండ జిల్లా హుజూర్‌నగర్ తాలూకా చిలుకూరులో శ్రీ రావినారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. ఈయన మార్క్సిస్ట్ భావాలు గల యువకుడు. ఈ సందర్భంగా జరిగిన మహిళా సభకు శ్రీమతి రంగమ్మ ఓబుల్‌రెడ్డి అధ్యక్షత వహించారు.

తొమ్మిదవ ఆంధ్రమహాసభ వరంగల్‌జిల్లా ధర్మవరంలో శ్రీమాదిరాజు రామకోటేశ్వరరావు గారి అధ్యక్షతన 1942లో జరిగింది. మహిళా సభ శ్రీమతి రంగమ్మ ఓబల్‌రెడ్డిగారు అధ్యక్షతన జరిగింది.

పదవ ఆంధ్ర మహాసభ 1943మేలో హైదరాబాద్ నగరంలో రెడ్డి విద్యార్థి వసతి గృహ ప్రాంగణంలో శ్రీ కొండా వెంకట రెడ్డిగారి అధ్యక్షతన జరిగింది శ్రీమతి యల్లా ప్రగడ సీతాకుమారి అధ్యక్షతన మహిళా సభ జరిగింది.

పదకొండవ ఆంధ్ర మహాసభ 1944లో శ్రీ రావి నారాయణ రెడ్డి గారి అధ్యక్షతన నల్లగొండ జిల్లా భువనగిరిలో జరిగింది. ఈ సభలోనే ఈ సంస్థ పూర్తిగా కమ్యూనిస్టు భావాలు గల వారి చేతిలోకి పోయింది. ఆంధ్రమహాసభలో స్పష్టంగా రెండు వర్గాలు ఏర్పడ్డాయి. ఒకరు కాంగ్రెస్ సానుభూతి పరులు కాగా రెండవ వారు మార్క్స్ సిద్ధాంత వాదులైన కమ్యూనిస్టులు.

12వ ఆంధ్ర మహాసభ ఖమ్మం పట్టణంలో శ్రీ రావి నారాయణరెడ్డి గారి అధ్యక్షతన 1945లో జరిగింది. ఈ సభలో శ్రీ బద్దం ఎల్లారెడ్డి, సర్వే దేవ భట్ల రామనాథం, మఖ్దూం మొహిమొద్దీన్, ఆరుట్ల రామ చంద్రారెడ్డి, రాజ్ బహదూర్ గౌర్ మొదలైన కమ్యూనిస్టు నాయకులు పాల్గొన్నారు.


రాజ్‌బహదూర్‌గౌర్


మఖ్దుం మొహిద్దీన్

12వ ఆంధ్ర మహాసభ వరంగల్ జిల్లా మడికొండలో శ్రీ.ఎం. నరసింగరావు అధ్యక్షతన జరిగింది.

పదమూడవ ఆంధ్రమహాసభ 1946లో మెదక్‌జిల్లా కందిలో సర్దార్ జమలాపురం కేశవరావు అధ్యక్షతన జరిగింది. ఈ మహాసభలోనే తెలంగాణాలో రాజకీయోద్యమం ఒక స్పష్టమైన స్వరూపాన్ని పొంది ప్రజా ఉద్యమంగా రూపు దాల్చింది. జమలాపురం కేశవరావు గారు నాయకత్వం చేపట్టాక ఆంధ్రోద్యమ కార్యక్రమాలలో విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకున్నాయి.






సర్దార్ జమలాపురం కేశవరావు

ఆ తరువాత ఆంధ్రమహాసభలు జరుగలేదు.

ఈ సభల మూలంగా తెలంగాణా ప్రాంతంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. ప్రజలలో చైతన్యం వచ్చింది. మహిళల్లోనూ చైతన్యం వచ్చింది. కార్యకర్తలు అధిక సంఖ్యలో స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు.

## కొనసాగిన సత్యాగ్రహాలు

**ప్రథమ సత్యాగ్రహం :**

1938 అక్టోబర్ 24న సుల్తాన్ బజార్ టెలిగ్రాఫ్ ఆఫీసు వద్ద హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నిర్మాణం జరిగింది. అక్కడ వేలాది మంది గుమిగూడారు. అప్పుడు నానక్‌ను అరెస్టు చేసి చంచల్‌గూడ జైలుకు పంపించారు. అక్టోబర్ 27న స్వామీజీని అరెస్టు చేశారు. ఈ ఉద్యమం సందర్భంగా సంస్థానంలోని వివిధ జిల్లాలలో వందలాది మంది కార్యకర్తలు సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు.

స్వామి రామానంద తీర్థ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నాయకత్వాన్ని చేపట్టిన తరువాతనే సంస్థాన స్వాతంత్ర్య ఉద్యమానికి ఒక నిర్దిష్ట స్వరూపం వచ్చింది. ఆనాడు ఆయన పిలుపు నందుకొని ఎంతో మంది యువతీ యువకులు - కార్యకర్తలు ఉద్యమంలోకి దూకారు. సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని జైలు శిక్షననుభవించారు. ఎంతటి త్యాగానికైనా సిద్ధపడ్డారు.

**ప్రథమ రాజకీయ మహాసభ :**

అసలు 1931లోనే హైదరాబాదు సంస్థానం వెలుపల బెరార్‌లోని అకోలాలో

హైదరాబాద్ రాష్ట్ర ప్రథమ రాజకీయ మహాసభ జరిగింది. ఎన్ని విజ్ఞప్తులు, విన్నపాలు పంపుకొన్నా సంస్థానంలో ఈ మహాసభ జరుపుకొనడానికి ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. అందువల్ల అకోలాలో జరుపవలసి వచ్చింది. ఈ సభకు రామచంద్రనాయక్ అధ్యక్షత వహించారు. ఈ సభలో మాట్లాడిన పలువురుపెద్దలు సంస్థానంలో ప్రాథమికహక్కులే కరువయ్యాయని నొక్కిచెప్పారు. సభలో కొన్ని తీర్మానాలు కూడా చేశారు. కాని అంతటితోనే దాని కార్యక్రమం ఆగిపోయింది.

1930 ప్రాంతంలో శ్రీమతి పద్మజా నాయుడు కొందరు ముస్లిం మంత్రుల సహాయంతో "స్వదేశీలీగ్" స్థాపించారు. ఈ సంస్థ ఖాదీ ప్రచారం మాత్రమే చేయగలిగింది.

1932లో రెసిడెన్సీ ప్రాంతంలో 'హిందూ స్థాయీ సంఘం" అనే పేరుతో కాశీనాథ్ రావు వైద్యా ఒక సంస్థను స్థాపించాడు. స్వదేశీ వస్తు విక్రయం వంటి కొన్ని కార్యక్రమాల నిర్వహణ తరువాత ఈ సంస్థ పని చెయ్యలేదు.

**వందేమాతరం ఉద్యమం:**

స్టేటు కాంగ్రెస్‌పై నిషేధం తొలగించాలన్న సత్యాగ్రహోద్యమం అన్ని జిల్లాలకూ వ్యాపించింది. ప్రజలలో పెద్ద సంచలనం కలిగింది. ఇంతకు మునుపెన్నడూ ఇంత పెద్ద ఎత్తున ప్రభుత్వపు ఆజ్ఞలను ధిక్కరించటం జరుగలేదు. అరెస్టులు జరుగలేదు.

ఈ ఉద్యమ ప్రభావం విద్యార్థులపై కూడా బాగా పడింది. యువజనులు, విద్యార్థులు అనేకులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు.

ఆ రోజుల్లో హైదరాబాదు సంస్థానం అంతటా పాఠశాలల్లో ప్రతిరోజు ఉదయం తరగతులు ప్రారంభం కావటానికి ముందు నిజాం రాజును కీర్తిస్తూ ప్రార్థనా గీతం పాడేవారు.

"భగవంతుడు నిజాం రాజ్యాన్ని చల్లగా చూచుగాక. అల్లా నిజాం రాజుకు శుభములు చేకూర్చుగాక" అనేది గీతం తాత్పర్యం.

జాతీయోద్యమ ప్రభావం, స్టేటు కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమ ప్రభావం వల్ల విద్యార్థులు వందేమాతర గీతాన్ని పాడసాగారు. నిజాం రాజును స్తుతిస్తూ పాడే ప్రార్థనలో పాల్గొనని విద్యార్థులను అధికారులు పాఠశాలల నుంచి బహిష్కరించారు.

1938వ సంవత్సరంలో దసరా పండుగ నాడు ఉస్మానియా విశ్వవిద్యాలయం "బి" హాస్టలులో విద్యార్థులు సమావేశమైనప్పుడు వందేమాతరం గీతాన్ని పాడుకున్నారు. ఆ తరువాత ప్రతి రోజూ రీడింగ్ రూంలో సమావేశమై వందేమాతరం గీతాన్నీ, మరి కొన్ని దేశభక్తి





గీతాలను పాడుకోవడం మొదలు పెట్టారు. ఈ సమావేశాలలో ఎక్కువగా హిందువుల ఉండేవారు.

ఈ విషయం తెలిసిన వసతి గృహ అధికారులు వందేమాతరం గీతం రాజకీయాలకు సంబంధించినదనీ, విద్యార్థులు రాజకీయాలతో సంబంధం పెట్టుకోకూడదనీ ఒక సర్క్యులర్ జారీ చేశారు.

అయితే విద్యార్థులెవ్వరూ ఈ సర్క్యులర్‌ను ఖాతరు చెయ్యలేదు. ఈ గీతం పాడే వారి సంఖ్య క్రమేణా రోజు రోజుకూ ఎక్కువ కాజొచ్చింది.

దీని పర్యవసానంగా 1938 నవంబర్ 29న హాస్టలులో నివసించే హిందూ విద్యార్థులందరినీ కళాశాల నుంచి బహిష్కరించారు. హాస్టలు గదులను వారు వెంటనే ఖాళీ చేసి వెళ్లాలని అధికారులు నోటీసు జారీ చేశారు.

విశ్వవిద్యాలయ అధికారులు ఈ అనాలోచిత చర్యకు యూనివర్సిటీ విద్యార్థులు సమ్మె చేశారు. వీరిలో అధ్యధిక శాతం హిందువులే. రెండు రోజుల తరువాత యూనివర్సిటీ గేట్ల ముందు పికెటింగ్ జరిగింది.

ఈ వార్త హైదరాబాద్ సంస్థానంలోని అన్ని జిల్లాలకు ప్రాకి పోయింది. నగరంలోని ఇతర కళాశాలల విద్యార్థులు, కొన్ని ఉన్నత పాఠశాలల విద్యార్థులు ఈ సమ్మెలో పాల్గొన్నారు. ఔరంగాబాద్, వరంగల్, గుల్బర్గా, పర్భనీ, నాందేడ్, మహబూబ్‌నగర్ జిల్లాలలో విద్యార్థులు కూడా సమ్మె చేసి, తరగుతలను బహిష్కరించారు. వందేమాతర గీతం సంస్థానమంతటా మారు మ్రోగింది.

పది రోజుల తరువాత డిసెంబర్ 10వ తేదీన సమ్మెలో పాల్గొంటున్న విద్యార్థులంతా తమ చర్యకు క్షమాపణ పత్రం రాసియిస్తే, తరగతులకు హాజరుకావచ్చని అధికారులు ప్రకటించారు. క్షమాపణ పత్రాలు రాసి ఇవ్వని వారి పేర్లు తీసివేస్తామని హెచ్చరించారు.

ఈ ప్రకటన విద్యార్థులను ఖాతరు చెయ్యలేదు. ఉద్యమం ఉధృతమైంది. ఉస్మానియా విశ్వవిద్యాలయం, దాని అనుబంధ కళాశాలల్లో చదువుతూ, సమ్మెలో పాల్గొంటున్న దాదాపు 350 మంది విద్యార్థులను తొలగించారు. భారత దేశంలో ఏ విశ్వవిద్యాలయంలోనూ వీరికి ప్రవేశం ఇవ్వకూడదని ఇంటర్ యూనివర్సిటీ బోర్డుకు రాశారు.

ఆ రోజుల్లో మధ్యప్రదేశ్ (సి.పి) రాష్ట్రానికి నాగపూర్ రాజధాని. చివరికి నాగపూర్ విశ్వవిద్యాలయం వారు ఉస్మానియా విశ్వవిద్యాలయం బహిష్కరించిన వారిని తీసుకోడానికి ఒప్పుకొంది. అలా ఇక్కడి విద్యార్థులు కొందరు నాగపూర్ వెళ్లి చదువు కున్నారు. అలాంటి



వందేమాతరం రామచంద్రరావు

వారు పి.వి. నరసింహారావు, అచ్యుతరెడ్డి, నూకల రామచంద్రారెడ్డి, సర్వదేవరభట్ల రామనాథం, ఎస్. చెన్నారెడ్డి, బి. లక్ష్మీకాంతరావు, లక్కినేని నరసయ్య మొదలైనవారు.

**జైల్లో వందేమాతరం :**

జైలులో ఉన్న ఖైదీలు ప్రతిరోజూ వందేమాతరం గీతం పాడుతూ ఉండేవారు. ఈ గీతాన్ని ప్రభుత్వం నిషేధించింది. కాబట్టే జైల్లో పాడడానికి వీలు లేదని జైలరు హుకుం జారీ చేశాడు. అయినా ఎవరూ దీనిని పాటించలేదు. ఈ గీతాన్ని పాడుతూ లాఠీ దెబ్బలు తిన్నారు. ఆర్య సమాజ్ సత్యాగ్రహి యువకుడు వందేమాతరం రామచంద్రరావు నిజాం ఆజ్ఞలను ధిక్కరించి ఈ గీతాన్ని బిగ్గరగా పాడసాగాడు.

అప్పుడు జైలు అధికారులు ఆయనను ఒక్కొక్క ఉచ్చారణకు ఒక్కొక్క దెబ్బ కొడుతూ పోయారు. స్పృహ తప్పే వరకూ ఆయనను కోడుతూ పోయారు.

ఆ రోజు నుండే 'వావిలాల' రామచంద్రరావు పేరు వందేమాతరం రామచంద్రరావుగా మారిపోయినది.

★☆★





# 4. హైదరాబాద్ సంస్థానంలో జాతీయోద్యమం

1936, 1937 సంవత్సరాలలో కొనసాగిన హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమం చరిత్రాత్మకమైనది. ఉద్యమం అప్పుడే ఒక నూతన ఘట్టంలోకి ప్రవేశించింది. ఈ కాలంలోనే ప్రజలలో అప్పటి వరకూ నిక్షిప్తమై ఉన్న రాజకీయ భావాలు ఒక నిర్దిష్టమైన స్వరూపం పొంది బహిర్గత మయ్యాయి. హైదరాబాదు సంస్థానంలో అప్పుడున్న కోటిన్నర ప్రజలకు నిజాం మత పాక్షికత, నిరంకుశ పరిపాలన నుంచి విముక్తి కలిగించి ప్రజాస్వామ్య పరిపాలన నెలకొల్పడానికి ఎటువంటి త్యాగాలకైనా సంసిద్ధమైన శక్తులన్నీ ఒకే చోటికి కేంద్రీకరించబడ్డాయి.

అప్పటి వరకూ రాజకీయాలతో తమ కెటువంటి సంబంధం లేదని, కేవలం సాహిత్య, సాంస్కృతిక, సాంఘిక, భాషా విషయాలకు మాత్రమే తమ కార్యకలాపాలు పరిమితమైనవనీ చెబుతూ వచ్చిన పెద్దలు, సంస్థలూ ప్రభుత్వంతో ముఖాముఖి పోరాటానికి రంగంలోకి దిగక తప్పలేదు.

అప్పటికే ఈ రాజకీయేతర ప్రజాహిత సంస్థల్లోకి విద్యావంతులైన అతి వాదులు ప్రవేశించారు. వారి ఒత్తిడికి తట్టుకోలేక వివిధ సంస్థలకు ఆధిపత్యం వహిస్తున్న మితవాద నాయకులు రాజకీయ పరిధిలోకి రాక తప్పలేదు. అటు సంస్థానం సరిహద్దుల అవతల మద్రాసు, బొంబాయి, మధ్య ప్రదేశ్ రాష్ట్రాలలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమం కొనసాగుతూ ఉంటే, దాని ప్రభావం సంస్థానంలోని విద్యావంతులైన యువకులపై పడింది.

ఇక ప్రజానీకంలో నానాటికీ హెచ్చుతున్న జాగృతిని తన పాశవిక శక్తులతో ప్రభుత్వం అరికట్టజూసింది.

**ఆర్యసమాజ్ స్థాపన :**

1892లో హైదరాబాద్ నగరంలో ఆర్యసమాజ్ స్థాపన జరిగింది. ముస్లిం వ్యతిరేక సంస్థ అనే పేరుతో ఆర్య సమాజ్ నాయకులైన నిత్యానంద బ్రహ్మచారి, విశ్వానంద సరస్వతి మొదలైన వారిని జైలులో పెట్టారు.

అయితే ఆర్య సమాజ్‌కు భారత దేశంలోని అన్ని ప్రాంతాల కంటే హైదరాబాద్‌లో ఎక్కడ లేని ప్రాముఖ్యత లభించింది. దానికి నిజాం నవాబు ముస్లిం మత పక్ష పాతవిధానమే కారణం. దానికి తోడు హిందువులలో పాతుకు పోయిన సనాతన ధర్మాలు, మూఢ నమ్మకాలు అతి బాల్య వివాహాలు, ముసలి లగ్నాలు - వాటి వల్ల సంభవించే నష్టాలు ప్రబలు తున్న తీరు.

అలా క్రమంగా హిందూమతం నానాటికీ క్షీణిస్తూ పోవడం కారణం అనక తప్పదు. హిందూమతంలోనే శాఖలు బయలుదేరి భేద భావాలు ప్రబలడం ఒక కారణం.

ఈ విపత్కర పరిస్థితిని ఎదుర్కోడానికి దయానందులవారు రెండు వరాలను ప్రసాదించారు. ఒకటి శుద్ధి, మరొకటి సంఘటన.

హైదరాబాద్‌లో ముస్లిం నవాబులు, జాగీర్దార్లు ఉన్నతోద్యోగులు దాస, దాసీ జనాన్ని లోభమోహాలకు గురి చేసి మతాంతరీకులను చేయటంపరిపాటి అయిందప్పుడు.

హిందూ మతంపై సాంస్కృతిక దాడి. జరుగుతూ వచ్చింది. అందువల్లనే ఆర్యసమాజ్ రంగంలోకి దిగింది. మతాంతరులైన హిందువులను చేసే కార్యక్రమానికి పూనుకుంది. ఏకేశ్వరోపాసన చేయించడానికి పునుకున్నది. అందుకే హిందువులు ఆర్య సమాజ్ వైపు మొగ్గు చూపి, తమ ధర్మాన్ని కాపాడే శక్తివంతమైన సంస్థ ఆర్యసమాజ్ అని భావించ సాగారు.

ప్రజానీకాన్ని సంఘటిత పరచి, వారిలో ధార్మిక నిష్ఠ, ఆత్మవిశ్వాసం కలిగించే క్రియా శీలమైనది ఆర్యసమాజ్, హైదరాబాద్‌లో ఆర్య సత్యాగ్రహం స్వధర్మ రక్షణ కొరకు జరిగిందే కాని మత పక్షపాతం తో కాదు. మతోన్మాద పూరితమైనది అంతకన్నా కాదు. అదిగాక



వినాయక రావు



పండిత నరేంద్రజీ



కొత్తూరు సీతయ్య గుప్త

కేశవరావు, వినాయక్‌రావు, కొత్తూరు సీతయ్య గుప్త, ఎస్. వెంకట స్వామి వంటి నాయకులు జాతీయ భావాలుగల కాంగ్రెస్ వాదులు. ముఖ్యంగా పండిత నరేంద్రజీ సిసలైన జాతీయ వాదిగా పేరుగాంచారు.





బాలగంగాదర తిలక్ ప్రతిపాదించి, ప్రోత్సహించిన"గణేష్ ఉత్సవాలు" 1896 నుంచి ఆర్య సమాజ్ ఆధ్వర్యంలో హైదరాఅద్‌లో జరుగుతూ వచ్చాయి. ఈ గణేశ్ ఉత్సవాల సందర్భంలో ఊరేగింపు తీయటానికి ప్రభుత్వంఅనుమతిని పొందవలసి వచ్చేది. కొద్ది సంవత్సరాలలోనే ఈ గణేశ్ ఉత్సవాల కార్యక్రమం హైదరాబాద్ సంస్థానంలో అన్ని జిల్లాలకు వ్యాపించింది.

1906, 1907లలో హైదరాబాద్‌లో వివేకవర్ధనీ విద్యా సంస్థ, గుల్బర్గాలో నూతన విద్యాలయం వంటి విద్యాసంస్థలు స్థాపించబడటంతో హైదరాబాద్ సంస్థానంలోని హిందూ ప్రజలలో ఆత్మవిశ్వాసం కలిగించడంలోనూ, కొందరు మతోన్మాదులైన ముస్లింల దురాగతాల నుంచి హిందువులను కాపాడటంలోనూ, వారు ఆత్మ రక్షణ చేసుకోడానికి తోడ్పడటంలోనూ, ఆర్యసమాజ్ నిర్వహించిన పాత్ర చారిత్రాత్మకమైనది.

కాగా పండితన నరేంద్రజీ, వందేమాతరం రామచంద్రరావు, వందే మాతరం వీరభద్రరావు, పండిత రుద్రదేవ్ వంటి ఎందరో దేశ భక్తులు చేసిన కృషి కొనియాడదగినది.

## హైదరాబాద్ సంస్థానంలో జాతీయోద్యమం :

ఆర్యసమాజ్ వారు "వైదికాదర్శం" అనే పత్రికను నడిపారు. దీనికి పండిత నరేంద్రజీ బాధ్యత వహించారు. ఈ పత్రిక ప్రభుత్వ అత్యాచారాలను బయట పెట్టింది. యువతీ యువకులలో సాహసాన్ని, ధైర్యాన్ని కలిగించింది. మత మార్పిడులను అరికట్టింది.

నిజాం ప్రభుత్వం దీనిని మతసంబంధమైన ఉద్యమంగా పరిగణించింది.

1938 అక్టోబర్‌లో పండిత నరేంద్రజీని అరెస్టు చేసి మహబూబ్‌నగర్ జిల్లాలో దట్టమైన అడవి ప్రాంతంలో ఉన్న మన్ననూర్ జైల్లో పెట్టింది. సంవత్సరం ఆరు నెలల తరువాత ఆయనను విడుదల చేసింది. పండిత నరేంద్రజీ దేశసేవ, త్యాగనిరతి, కర్మ నిష్ఠ, ధైర్యసాహసాలు కొనియాడదగినవి.



పండిత నరేంద్రజీ

★☆★

# 5. హైదరాబాద్ సంస్థానంలో అరాచకాలు

బ్రిటిష్ అధీనంలో ఉన్న భారతదేశంలోని ప్రజాస్వామిక ఉద్యమాలు హైదరాబాద్ రాజ్యంలో సైతం గణనీయంగా సాగి ఎంతో ప్రభావాన్ని కనబరచాయి. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించే క్రమంలో హైదరాబాద్ రాజ్యమంతటా ముస్లిం మతాధిక్యతను నెలకొల్పి పాలకవర్గ విస్తరణకు, పటిష్టతకు తోడ్పడితే స్వతంత్ర దేశంగా హైదరాబాద్-సంస్థానం నిలువగలదన్న ఊహ బలంగా రూపుదిద్దుకుంది. ఖిలాఫత్ ఉద్యమం వల్ల దేశ వ్యాప్తంగా హిందూ-ముస్లింల ఐక్యతా భావాలు వ్యాపించడంతో అవి జాతీయ భావనలకు దారి తీసి సంస్థానాల మనుగడకు నష్టం కలిగిస్తాయని ముస్లిం పాలక వర్గాలు అనుమానించాయి.

ఫలితంగా నిజాం నవాబు మీర్ ఉస్మాన్ ఆలీకాన్ ప్రోద్బలంతో 1927లో ముస్లింల సాంఘిక-మత సంస్థగా 'అంజుమన్-ఎ-తబ్లిక్-ఎ-ఇస్లాం' సంస్థ అవతరించింది. దీనికి అధిపతి నిజాంకు దగ్గర బంధువు అయిన జాగీర్దార్ నవాబ్ బహదూర్ యార్ జంగ్. ఇస్లాం చరిత్రపై బాగా అధ్యయనం చేసిన బహదూర్ యార్ జంగ్ ఖురాన్ భాష్యంలో దిట్ట. ఆరడుగుల కన్నా ఎత్తుగల ఆజానుబాహు విగ్రహం. గర్జన లాంటి ధ్వనితో ఆయన ప్రసంగాలు నిజాం సభలో సైతం ప్రత్యేక ఆకర్షణగా నిలిచేవి. హైదరాబాద్ రాజ్యంలో ముస్లింల ఆధిపత్యం (ముస్లిం ఏ ఖై-దర్) అన్న లక్ష్యంతో "మజ్లిస్-ఎ-ఇత్తెహాద్-ఉల్-ముస్లమీన్' (ఎం.ఐ.ఎం)



**మీర్ ఉస్మాన్ అలీఖాన్**





1929లో ఏర్పడింది. ముస్లిం పాలకులు 'హైదరాబాద్ రాష్ట్రంలోని ఇతర ప్రజలను పాలించడానికే వారు జన్మించారు' అన్న సూత్రంతో మనోభావాలను రెచ్చగొట్టి అత్యధిక శాతం ముస్లిం ప్రజలను తమవైపు తిప్పు కోవడంతో పార్టీ సఫలమైంది.

**హిందూ సమాజానికి అరిష్టం :**

హిందూ సమాజంలో అంటరాని వారుగా ఉన్న అట్టడుగు వర్గాల ప్రజలను ప్రలోభపెట్టి సామూహిక మతమార్పిడులకు శ్రీకారం చుట్టారు. అధికారిక లెక్కల ప్రకారమే ఈ సంస్థ 1938 నాటికి దాదాపు 12 వేల మందిని ముస్లింలుగా మార్చివేసింది.

**స్థానిక స్వపరిపాలన పట్ల కలిగిన అవగాహన :**

1935 సంవత్సరంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రారంభించిన సంస్కరణలు, స్థానిక స్వపరిపాలన పట్ల హైదరాబాద్ రాష్ట్రంలో విస్తృతమైన చర్చలు ప్రారంభమయ్యాయి. ఆనాడు ఏ సంఘటన జరిగినా కనీసం మూడు రకాల భిన్నాభిప్రాయాలు వ్యాప్తిలో ఉండేవి.

1. రాజ్యం మొత్తం తన గుత్త సంస్థగా భావించే నిజాం నవాబు స్వార్థపూరిత ఆలోచనా విధానాలు ఒక వైపు.
2. ముస్లిం మతస్తుల సర్వసత్తాక ప్రాబల్యమే ముఖ్యమనే మజ్లిస్ పార్టీ భావన ఒక వైపు.
3. భారత జాతీయ స్రవంతి వైపు మొగ్గ చూపే మెజారిటీ ప్రజల మనోభావాలు మరో వైపు సుడులు తిరిగేవి.

   వేగంగా మారుతున్న సామాజిక పరిస్థితులు, రాజకీయ ఉద్యమాలతో కలత చెందిన బహదూర్ యార్ జంగ్ దీర్ఘ కాలిక కార్యక్రమంగా ప్రారంభించిన మత మార్పిడి కార్యక్రమం, దాని వల్ల తలెత్తిన ఉద్రిక్త పరిస్థితులదృష్ట్యా కొత్త ఎత్తుగడలకు సిద్ధమయ్యారు.

**బహదూర్ యార్ జంగ్ ఆల్ ఇండియా ముస్లింలీగ్ అధ్యక్షుడుగా :**

బహదూర్ యార్ జంగ్ దేశంలోని ముస్లిందరిని ఏకం చేయాలనే కార్యక్రమంతో ఆల్ ఇండియా ముస్లిం లీగ్ అధ్యక్షుడిగా ఎంపికయ్యాడు. ముస్లిం లీగ్ అధ్యక్షునిగా భారతదేశం మొత్తం పర్యటించి ముస్లిం మత ఛాందస వాదాన్ని రెచ్చ గొట్టడం ప్రారంభించాడు.

బహదూర్ యార్ జంగ్ మనో ఫలకంలో ముస్లిం పరిపాలకుని ఆధిక్యత కన్నా ముస్లిం ప్రజానీకపు ఆధిక్యత ముఖ్యమనే భావన బలపడింది. రాజు కన్నా ముస్లిం ప్రజలే ఎక్కువ

అనే ఈ భావం వ్యాపించడం నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్‌కు ఏ మాత్రం నచ్చలేదు.

దేశ వ్యాప్తంగా ముస్లిం ప్రజల్లో బహదూర్ యార్ జంగ్‌కు లభించిన పలుకుబడి నిజాం నవాబులో సైతం ఈర్ష్యను రేపింది. సంస్థానంలోని ముస్లింలలో బహదూర్ యార్ జంగ్‌కు ఏర్పడ్డ పట్టు ప్రమాదకరమన్న బ్రిటిష్ అధికారుల హెచ్చరికతో మేలుకున్న నిజాం 1943లో బహదూర్ యార్ జంగ్ ఉపన్యాసాలను నిషేధించాడు.

**బహదూర్ యార్ జంగ్ ఆకస్మిక మరణం :**

ఆ తరువాత కొన్ని నెలలకే 1944లో బహదూర్ యార్ జంగ్ ఆకస్మికంగా మరణించాడు. అతని మృతిపై పలు అనుమానాలు నెలకొన్నాయి. అనంతరం జరిగిన పరిణామాల పర్యవసానంగా నిజాం నవాబుకు మజ్లిస్ పార్టీ రాజకీయ మద్దతు అని వార్యంగా మారింది. బహదూర్ యార్ జంగ్ స్థానంలో ఖాసిం రజ్వీ ఎన్నికయ్యాడు.

**మజ్లిస్ పార్టీ నూతనాధ్యక్షుడు ఖాసిం రజ్వీ :**

మజ్లిస్ పార్టీ నూతనాధ్యక్షుడిగా ఎన్నికైన ఖాసిం రిజ్వీ ఓ వింత ప్రకృతి గల వ్యక్తి. ఆవేశం తప్ప ముందు చూపు, హేతు బద్ధత కరువైన నాయకుడు. పార్టీ ఆధిపత్యం ఖాసిం రజ్వీ ఆలోచనలకు పట్ట పగ్గాలు లేకుండా చేసింది. భారత దేశ చిత్ర పటాన్ని తిరిగి తయారు చేస్తానని ప్రగల్భాలు పలకడం మొదలు పెట్టి యమునా నది నిజాం రాజ్య అంతర్భాగం కావటం, ఎర్రకోటపై ఆసఫ్ జాహీ పతాకం రెపరెప లాడటం ఖాయమని ప్రకటించాడు ఖాసం రజ్వీ.


ఖాసిం రజ్వీ

**మజ్లిస్ పార్టీకి అనుబంధంగా వుండే సాయుధ విభాగంగా రజాకార్లు :**

**రజాకర్ల దురాగతాలు :**

మజ్లిస్ పార్టీకి అనుబంధంగా ఉండే సాయుధ విభాగంగా 1940లో రజాకార్లు రూపుదిద్దుకున్నారు. అపరిమితమైన ఆయుధ సంపత్తి, వాహనాలు, డబ్బు అందుబాటులో





ఉండటంతో రజాకార్లు (రజాకార్లు అంటే స్వచ్ఛంద సేవకులు)గా పని చేయటానికి వేలాది మంది ముస్లిం యువకులు సిద్ధ పడ్డారు. అనల్ మాలిక్ (ప్రతి ముస్లిం పరిపాలకుడే) అనే నినాదంతో దక్కను రాజ్యమైన హైదరాబాద్ పై ముస్లింల ఆధిపత్యం కాపాడటానికి ప్రాణాలర్పించడానికైనా సిద్ధమేనని ప్రతి రజాకారు ప్రమాణం చేసేవాడు.

వార్తా పత్రికలు, బులెటిన్ల సహాయంతో రజాకారు ఉద్యమాన్ని భారత దేశంలోని పలుపట్టణాలకు విస్తరించడంతో పాటు నిజాం సరిహద్దు రాష్ట్రాలైన బొంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీ గ్రామాలపై కూడా రజాకార్లు దండయాత్రలు ప్రారంభించారు.

ఇక తెలంగాణా ప్రాంతంలో నైతే రజాకార్ల దురాగతాలకు అంతులేకుండా పోయింది. నిజాం వ్యతిరేక ప్రజాస్వామ్య ఉద్యమకారులు మొదలు వారికి ఆశ్రయం కల్పించిన గ్రామాలు రజాకార్ల ముష్కర దాడులకు విలవిల లాడాయి. తెలంగాణా ప్రజా ఉద్యమం సాయుధ పోరాటంగా మారింది - ఈ పోరాటం సాయుధ పోరాటంగా మారిన తరువాత రజాకార్ల ఉన్మాదం తారా స్థాయికి చేరింది. పట్టణాల్లోని ముస్లిం అధికృత, అధికార యంత్రాంగం అండదండలు రజాకార్ల కార్యకలాపాలకు కేంద్రాలుగా మారాయి. వందలాది మంది రజాకార్లు, గ్రూపులుగా గ్రామాలపై దాడులు చేయడం, అడ్డు వచ్చిన వారిని, చేతికి చిక్కిన ఉద్యమ కారులను చంపడంతో పాటు స్త్రీలను మానభంగం చేయడం నిత్య కృత్యాలుగా మారాయి.

నగరాల్లో సైతం రజాకార్లకు ఎదురు మాట చెప్పి బతికే పరిస్థితి లేకుండా పోయింది. కమ్యూనిస్టుకు వ్యతిరేకంగా ఖాసిం రజ్వీ సాగించిన దురాగతాల వల్ల వేలాది మంది ప్రాణాలు కోల్పోయారు. అంతులేని ఆస్తి నష్టం జరిగింది. గ్రామాల్లోని ప్రజలపై దాడులతో సంతృప్తి చెందని రజాకార్లు జైళ్లలో మగ్గుతున్న రాజకీయ ఖైదీలపై సైతం దాడులు సాగించారు.

**అంతులేని దౌర్జన్యాలు - మారణకాండ :**

1948లో నిజామాబాద్ జిల్లా జైలుపై రజాకార్ల దాడిలో అనేక మంది ప్రాణాలు కోల్పోగా వందలాది మంది క్షతగాత్రులయ్యారు.

తెలంగాణా మహాకవిగా పేరు గాంచిన డా॥ దాశరధి కృష్ణమాచార్యులు సైతం ఈ సంఘటనలో కష్టాలనెదుర్కొన్నారు. గుల్బర్గాలోని జైలుపై రజాకార్లు జరిపిన దాడిలో పలువురు సత్యాగ్రహులు గాయపడ్డారు. ఆ సంఘటనలో స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానంద తీర్థతో పాటు మరి కొందరు నాయకులు దాడికి గురయ్యారు.

★☆★

# 6. మితిమీరిన రజాకార్ల దౌర్జన్యాలు

ఖాసిం రజ్వీ ఇత్తెహాదుల్ ముసల్మాన్‌కు అధ్యక్షుడయ్యారు. ఆయన ఆధ్వర్యంలో ప్రైవేట్ సైన్యం ఏర్పడింది. వీరినే "రాజాకార్లు" అనే పేరుతో పిలిచేవారు. వీరికి ఆయుధాలు అందజేసి మిలిటరీ శిక్షణను ఇచ్చారు. వీరిని పోలీసు దళాలకు జతచేసి స్వతంత్రం కోసం ఉద్యమించేవారిని అణచివేసేందుకు నిజాం ఉపయోగించాడు. అనేక గ్రామాలపై దాడులు చేసి పంటలను, వారి సంపదలను కొల్ల గొట్టారు. రైళ్లను ఆపి దోచుకున్నారు. మహిళలపై అత్యాచారాలు జరిపారు. వీరి దుశ్చర్యలకు విసిగిపోయిన ప్రజలు పెద్ద ఎత్తున తిరుగుబాటు చేశారు.

**గెరిల్లా పోరాటాలకు ప్రత్యేక దళం :**

రజాకార్ల దురాగతాలను ఎదుర్కొన్న వారిలో ఆరుట్ల రామచంద్రారెడ్డి ఒకరు. ఇంకామరెందరో సమర యోధులున్నారు. నిజాం దురాగతాలను అడ్డుకోవడానికి కమ్యూనిస్టు పార్టీ గెరిల్లా పోరాటాలకు ప్రత్యేక శిక్షణ కార్యక్రమాలు చేపట్టింది. అలా నిజాంకు వ్యతిరేకంగా ఒక ప్రత్యేక దళం ఏర్పడింది. ఈ దళం అనేక ప్రాంతాల్లో రజాకార్లు, నిజాం ప్రతినిధులపై దాడులు చేసింది. ఈ ఉద్యమంలో 4000 మంది గెరిల్లా సైన్యం, 10 వేల మంది ప్రతిఘటనా సైన్యం తయారైంది.

**కాంగ్రెస్ ఆధ్వర్యంలో కొనసాగిన ప్రజా ఉద్యమం :**

1938లో స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం నిర్వహించింది. గాంధీజీ "ఒక్క సత్యాగ్రహి ఉన్నా తమ ధ్యేయం నెరవేరుతుందని" చెప్పారు. రామానంద తీర్థ అందుకు సిద్ధమయ్యారు. 1941లో స్వామీజీని నిజాం ప్రభుత్వం అరెస్టు చేసింది. తరువాత విడుదల చేసింది.

1942లో నైజాం ఇండియన్ యూనియన్‌లో చేరాలని ఉత్తరం రాశారు.

1943లో ఆంధ్ర, మహా రాష్ట్ర ప్రాంతీయ కమిటీలు ఒకే కార్యాచరణ ప్రణాళికతో ముందుకు సాగాలని నిర్ణయించారు. 1944లో ప్రత్యేకంగా ఒక సమన్వయ కమిటీని ఏర్పాటు చేసుకున్నారు. 1944లోనే గాంధీజీ జైలు నుంచి విడుదల కావడం, బహదూర్ యార్ జంగ్ చనిపోవడం, కాశిం రజ్వీ సైన్యం బాధ్యతలు చేపట్టడం జరిగింది.

1946లో సంస్థాన ప్రజా మండలి స్థాయీ సంఘం పండిత్‌జీ అధ్యక్షతన సమావేశమైంది. కాంగ్రెస్ పై నిషేధాన్ని తొలగించాలని లేక పోతే తీవ్ర చర్య తీసుకోవలసి

నిజాంపై బాంబు దాడి



వస్తుందని హెచ్చరించారు.

కమ్యూనిస్టులు దైనందిన సమస్యలు తీసుకుని పోరాటం చేస్తుంటే కాంగ్రెస్ వారు కూడా సమన్వయ పద్ధతిపై అదే చేస్తూ వచ్చారు.

**జాతీయ జెండా వందన ఉద్యమం - మొగిలయ్య బలిదానం :**

దీనికి తోడు జాతీయ జెండా వందనం ఉద్యమంగా లేవ దీశారు. అంతటా ప్రభుత్వాదేశాలను ధిక్కరించి జెండా వందనం చేశారు. వరంగల్ కోటలో కాంగ్రెస్ పతాక వందనం జరిగింది. ఈ సందర్భంగా మొగులయ్య అనే దేశ భక్తుడు ప్రాణాలు కోల్పోయాడు. ఈయన మరణం ఎందరో యువకులకు స్ఫూర్తినిచ్చింది.

ఈ జాతీయ వందనమే 1946-47 భారత్ యూనియన్ విలీనం కావాలనే ఉద్యమానికి కీలకంగా మారింది.

**కాంగ్రెస్ పార్టీ సత్యాగ్రహం - తీవ్ర రూపం దాల్చిన పోరాటం :**

1947లో ఆగస్టు 15న భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కానీ నిజాంకు మాత్రం స్వతంత్ర హైదరాబాదు రాష్ట్రాన్ని రూపొందించుకోవాలన్న దురాలోచన కలిగింది. మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ రాష్ట్రమంతటా పెద్ద ఎత్తున ప్రచార కార్యక్రమం చేపట్టింది.

ఈ పోరాటానికి వ్యతిరేకంగా స్వామి రామానంద తీర్థ నాయకత్వంలో కాంగ్రెస్ పార్టీ సత్యాగ్రహ కార్యక్రమాన్ని చేపట్టింది. ఏడెనిమిది వేల మంది సత్యాగ్రహంలో పాల్గొన్నారు. నిజాం రాష్ట్రంలోని జైళ్లన్నీ నిండిపోయాయి. హైదరాబాద్ నగరంలో ప్రశాంతంగా ఉన్నట్లు, ఇతరులకు చూపించడానికి నాటక మాడారు. జిల్లాల్లో రజాకార్లు సాగించిన అత్యాచారాలను వర్ణించాలంటే గుండెలు అదిరిపోవడమే కాదు, కళ్లల్లోంచి రక్తాశ్రువులు ప్రవహిస్తాయి.

తన రాష్ట్రం స్వతంత్రంగా ఉండగలదని ప్రకటించడం ద్వారా నిజాం, నూతనంగా ఏర్పడిన ప్రభుత్వానికి ఒక నిగూఢ సమస్య తెచ్చిపెట్టాడు. రాష్ట్రంలోని నవ యువకులు రజాకార్లను ధైర్య సాహసాలతో ఎదురించారు.

కాంగ్రెస్ పార్టీవారు ప్రారంభించిన ఈ పోరాటంలో ఆర్య సమాజం వారు కూడా ముందుండేవారు. సత్యాగ్రహానికి ముందే కొందరినీ, ఆ తర్వాత ఎందరినో అరెస్టుచేశారు. చెంచల్‌గూడ జైలు సమర యోధులతో నిండిపోయింది. సత్యాగ్రహ నాయకులు స్వామిరామానంద తీర్థ, డా॥ మేల్కోటే, శ్రీకృష్ణాజీ ఆచార్య, జోషీ మొదలైన వారు సుల్తాన్‌బజార్‌లో సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు.

స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్

**శేష్‌రావు వాఘ్‌మారె బలిదానం :**

శ్రీ శేష్‌రావు వాఘ్‌మారె, అడ్వొకేట్‌గారు ప్రదర్శించిన ధైర్య సాహసం, దీరత్వం, బలిదానం హైదరాబాద్ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగింది. ఆయన నిష్టావంతుడైన ఆర్య సమాజ కర్మయోగి. ఆయన తన సంతానం-కొడుకులూ, కూతుళ్ల పెళ్లిళ్లన్నింటినీ ఆయన కులాంతర వివాహాలు జరిపించారు. ఫలితంగా ఆయన బంధువర్గం నుంచీ, సంబంధీకుల నుంచి దూరమయ్యారు.

★☆★

## జాయిన్ ఇండియా మూవ్‌మెంట్ 1947-48 :

హైద్రాబాద్ సంస్థానం భారత దేశంలోనే విలీనం కావాలని అధిక శాతం కోరుకున్నారు. 1946 జులైలో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ పై నిజాం నవాబు నిషేధం ఎత్తి వేశారు. 1947 మేలో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ప్రజా సదస్సు నిర్వహించింది. "జాయిన్ ఇండియా ఉద్యమం చేపట్టాలని ఈ సదస్సులో తీర్మానించబడింది. పై నుండి జయప్రకాశ్ నారాయన్, ఆచార్య ఎన్.జి.రంగా ఈ ఉద్యమానికి ఊపునిచ్చారు. స్వామి రామానంద తీర్థ, బూర్గుల రామకృష్ణారావు సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు. 1947 ఆగస్టు7న "జాయిన్ ఇండియా డే"గా ప్రకటించారు.

భారత దేశానికి స్వాతంత్ర్య ఘడియలు సమీపిస్తున్నకొద్దీ హైదరాబాద్ నగరంలో ఉత్కంఠ పెరిగింది. స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో భారత జాతీయ జెండాను ఎగురవేయడానికి ప్రయత్నించారు. దీన్ని నిజాం రజాకార్లమూకలు అడ్డుకున్నాయి.

1947 ఆగస్టు 13న హైదరాబాద్ సంస్థానం స్వతంత్రంగా ఉంటుందని నిజాం నవాబు ఫర్మానా జారీ చేశారు.

అయినా స్వామి రామానంద 1947 ఆగస్టు, 7న జాతీయ జెండా ఎగురవేసి తీరారు.





# 7. ఆజాద్ హైద్రాబాద్- నిజాం కలలు

**ఇండియన్ యూనియన్ విలీన ఉద్యమం :**

స్వతంత్ర భారత అవతరణ తరువాత భారతదేశ ఉపప్రధాని ఉక్కు మనిషి సర్దార్ వల్లభభాయిపటేల్ రాజనీతిజ్ఞత, దక్షత వల్ల భారత దేశంలోని స్వదేశీ సంస్థానాలన్నీ ఒక్కొక్కటీ ఇండియన్ యూనియన్‌లో విలీనమయ్యాయి. నిజాం నవాబు మాత్రం ఇండియన్ యూనియన్‌లో చేరకుండా కాలక్షేపం చేయసాగాడు. సంస్థాన ప్రజలలో ఉవ్వెత్తున లేచిన ఇండియన్ యూనియన్ విలీన ఉద్యమాన్ని అణచి వేయడానికి సన్నాహాలు చేశాడు. వేలాది కాంగ్రెస్, ఆర్యసమాజ్ కార్యకర్తలూ, కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీ కార్యకర్తలూ అరెస్టు చెయ్యబడ్డారు. జైళ్లన్నీ నిండిపోయాయి.

అప్పటి స్వతంత్ర భారత ప్రథమ గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ బ్యాటన్‌తోనూ, సర్దార్ పటేల్ తోనూ నిజాం ప్రతినిధులు అనేక సార్లు చర్చలు జరిపారు. కాని అవి ఫలించలేదు. స్వతంత్ర భారత అవతరణకు ముందు తన సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావలసిందిగా హోం శాఖ కార్యదర్శి నిజాంను కోరారు. నిజాం అందుకు అంగీకరించలేదు. స్వతంత్ర భారత ప్రభుత్వానికి చాలా జటిలమైన రాజకీయ సమస్యను సృష్టించాడు.

**యదాతథపు ఒడంబడిక :**

సర్‌మిర్జా ఇస్మాయిల్ రాజీనామా తరువాత హైదరాబాద్ సంస్థాన ప్రధాన మంత్రి పదవి స్వీకరించినఛతారీనవాబు ఢిల్లీ వెల్లి గవర్నర్ జనరల్‌తోనూ, దేశ వ్యవహారాల మంత్రి సర్దార్ వల్లభ భాయి పటేల్‌తోనూ చర్చలు జరిపారు. ఇటు సంస్థానంలో ఇత్తెహాదుల్ముసల్‌మీన్ రజాకారు దళాల దౌర్జన్యాలు నానాటికీ ఎక్కువ కాసాగాయి.

హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరదనీ స్వతంత్ర ముస్లిం రాజ్యంగా ఉంటుందనీ కాసిం రజ్వీ పదే పదే ప్రకటన చేయసాగాడు.

తుదకు లార్డ్ మౌంట్ బాటెన్ సలహాపై హైదరాబాదు ప్రతినిధి వర్గం 1947 అక్టోబర్‌లో భారత ప్రభుత్వంతో ఒక ఒడంబడికకు సంసిద్ధమైంది. ఈ ఒడంబడిక ముసాయిదా తీసుకొని హైదరాబాద్ ప్రతినిధి వర్గం నిజాం రాజు సంతకానికి హైదరాబాద్ వచ్చింది. ఇది తెలిసిన ఇత్తెహాద్ నాయకులు జిన్నా సలహా పొందడానికి రహస్యంగా పాకిస్తాన్ వెళ్లారు. ఒడంబడిక ముసాయిదాను నిజాం తన వద్దే పెట్టుకున్నాడు. రాత్రి మూడు గంటల ప్రాంతంలో ఇత్తెహాదుల్ముసల్మీన్ వాలంటీర్లు ప్రధానమంత్రి నివాస గృహం షా మంజిల్ (ఇప్పటి రాజ్‌భవన్)

పై దాడి చేశారు. హైదరాబాద్ ప్రతినిధి ఢిల్లీ వెళ్లకూడదనీ "ఆజాద్ హైద్రాబాద్ జిందాబాద్" అనీ నినాదాలు చేస్తూ అక్కడి బల్లలు, కుర్చీలు విరగ్గొట్టారు. ప్రధాన మంత్రి ఇంటిపై దాడి చేసి దౌర్జన్యానికి దిగిన గుంపుపై పోలీసులు ఎలాంటి చర్యలు తీసుకోలేదు. ముందుగా నిర్ణయించుకొన్న పథకం ప్రకారమే ఈ దాడి జరిగింది. ఖాసిం రజ్వీ, ఆయన రజాకారు దళాల మతోన్మాద దౌర్జన్యానికి ఈ సంఘటన పరాకాష్ఠ.

**ప్రధానమంత్రి మీర్ లాయక్ అలీ :**

ప్రధాన మంత్రి షా నవాబ్ ఛతారీ తన పదవికి రాజీనామా చేసి వెళ్లి పోయాడు. 1947 డిసెంబర్ 18న మీర్ లాయక్ అలీని ప్రధాన మంత్రిగా నియమించినట్లు నిజాం ప్రకటించాడు. లాయక్ అలీ హైదరాబాద్ నగరంలోని పెద్ద పారిశ్రామికవేత్త, వ్యాపార దక్షత గల ప్రముఖుడు. కాని ఆయనకు రాజకీయ అనుభవం లేదు. లాయక్ అలీ మంత్రి వర్గంలో నలుగురు హిందువులను మంత్రులనుగా తీసుకొన్నాడు.

1. పింగళి వెంకట రామారెడ్డి, ఉపప్రధాని.
2. బి.ఎస్. వెంకట్రావు (షెడ్యూల్డు తరగతుల ప్రతినిధి)
3. మల్లికార్జునప్ప
4. జె.వి. జోషి.

యధాతథపు ఒడంబడిక సందర్భాన్ని పురస్కరించుకొని కొందరు కాంగ్రెస్ నాయకులను ప్రభుత్వం విడుదల చేసింది. అందులో స్వామీజీ ఒకరు.

హైదరాబాద్ సంస్థానం, భారత ప్రభుత్వం మధ్య జరిగిన యధాతథపు ఒడంబడిక ప్రకారం శ్రీ కె.యం. మున్షీని హైదరాబాద్‌లో ఏజెంట్ జనరల్‌గా భారత ప్రభుత్వం నియమించింది. స్వామీజీ బొంబాయిలో ఉన్న మున్షీని, అక్కడి హైదరాబాద్ స్టేటు కాంగ్రెస్ కార్యాచరణ సంఘం సభ్యులను కలుసుకొని హైదరాబాద్ సరిహద్దు గ్రామాలలో నెలకొల్పిన కాంగ్రెస్ శిబిరాల కార్యక్రమం గురించి వారితో చర్చలు జరిపి హైదరాబాద్ వచ్చారు.

★☆★





# 8. విజృంభించిన పోరాటం

1940లో స్వామి రామానంద తీర్థ మరికొందరు కార్యకర్తలు సేవాగ్రాం వెళ్లి గాంధీజీని సందర్శించి, సంస్థానంలోని రాజకీయ పరిస్థితులను గాంధీజీకి వివరించారు. నిజాం ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగించలేదనీ, జాతీయ వాదులపై నిజాం ప్రభుత్వం వారు నానా యాతనలు పెడుతున్నారని వివరించారు.

1942లో ఆగస్టు మొదటి వారంలో బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభ "క్విట్ ఇండియా" తీర్మానం చేసింది. ఈ ఉద్యమంలో ప్రతి భారతీయుడు భాగస్వామి కావాలని పిలుపునిచ్చారు. స్వామి రామానంద తీర్థ ఈ సమావేశానికి హాజరై హైదరాబాద్‌కు తిరిగి వచ్చారు. రావడంతోనే ప్రభుత్వం ఆయనను నిర్బంధించింది.

ఈ సందర్భంలో హైదరాబాద్-సికింద్రాబాద్ నగరాల్లోనూ, అన్ని జిల్లాల్లోనూ వందలాది కార్యకర్తలు, నాయకులు ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించి అరెస్టయ్యారు. శ్రీయుతులు జి.యస్. మెల్కోటే, జమలాపురం కేశవ రావు, ప్రాణేశాచారి, వట్టికోట ఆళ్వారు స్వామి, గోవిందరావు షరాఫ్, కాళోజీ నారాయణరావు, ఎం.ఎస్. రాజలింగం, బద్రీ చంద్ చౌదరి, కాటం లక్ష్మీ నారాయణ, ప్రేమ్‌రాజ్ యాదవ్ మొదలైన వారెందరినో నిర్బంధించారు.

అక్టోబర్ 2న విక్టరీ ప్లే గ్రౌండ్‌లో బూర్గుల రామకృష్ణారావు, కాటం లక్ష్మినారాయణను అరెస్టు చేశారు.

1946 జూన్ 3న, స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగించారు. అప్పటి వరకు తెలంగాణ, మరాఠ్వాడా, కర్ణాటక ప్రాంతాలలో పనిచేస్తున్న నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర పరిషత్తు, కర్ణాటక పరిషత్తు కాంగ్రెస్‌లో విలీనమయ్యాయి. స్వామి రామానాంద తీర్థ స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు.

స్టేట్ కాంగ్రెస్ మహాసభ హైదరాబాద్ నగరంలోని ముషీరాబాద్‌లో 1947 జూన్ 16,17,18 తేదీలలో భారీ ఎత్తున జరిగింది. స్వామీజీ అధ్యక్షత వహించారు. ఆ సమావేశంలోనే 'హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలనీ, బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పాలని' ఉద్ఘాటించారు.

నిజాం నవాబు మాత్రం కింగ్ కోఠీ భవనంలో కూర్చొని తన సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరకుండా, స్వతంత్రంగా ఉండటానికి పన్నాగాలు పన్నసాగాడు.

పండిత జవహర్ లాల్ నెహ్రూ ప్రధానమంత్రిగా జాతీయ ప్రభుత్వం ఏర్పడింది. ఉక్కు మనిషి ఉప ప్రధాని సర్దార్ వల్లభ భాయి పటేల్ పరిపాలనా దక్షత, రాజనీతిజ్ఞత వల్ల భారత దేశంలోని దేశీయ సంస్థానాలన్నీ ఒక్కొక్కటీ ఇండియన్ యూనియన్‌లో విలీనమయ్యాయి. కాని నిజాం రాజు తాను స్వంతంత్రంగా ఉంటానని ప్రకటించాడు.



ప్రధాని

**జవహర్‌లాల్ నెహ్రూ**



ఉప ప్రధాని

**వల్లభ భాయి పటేల్**

**ఇండియన్ యూనియన్‌లో విలీన దినోత్సవం :**

1947, ఆగస్టు 7వ తేదీన సంస్థానమంతటా ఇండియన్ యూనియన్‌లో విలీన దినోత్సవం జరుపుకోవాలని స్టేట్ కాంగ్రెస్ నిర్ణయించింది. ఆగస్టు 7న స్వామీ రామానంద తీర్థ సుల్తాన్ బజార్ కూడలిలో సత్యాగ్రహం చేపట్టారు. "స్వతంత్ర భారత దేశం నుండి హైదరాబాద్ విడిపోవడాన్ని అందరూ ప్రతిఘటించాలని" నినాదమిచ్చారు. స్వామీజీని ఆరెస్టు చేసి జైల్లో పెట్టారు. మరుసటి రోజే విడుదల చేశారు.



స్వామి

రామానంద తీర్థ





విడుదలైన ఆయన హైదరాబాద్ నుండి విజయవాడకు బయలు దేరారు. ఆయనకు మధిర స్టేషన్‌లో ఆరెస్ట్ చేశారు. మధిరలో, ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు జమలాపురం కేశవరావు గారిని అరెస్టు చేశారు. వరంగల్ సెంట్రల్ జైలుకు పంపించారు.



సర్దార్

జమలాపురం

కేశవరావు



కె.వి. రంగారెడ్డి



ఎం.ఎస్.రాజలింగం

**సహాయ నిరాకరణోద్యమం -సరిహద్దు శిబిరాలు :**

సంస్థానపు సరిహద్దు అవతల ఇండియన్ యూనియన్‌లో కాంగ్రెస్ పోరాట శిబిరాలు నెలకొల్పి ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. ఈ శిబిరాలలో వందలాది మంది కార్యకర్తలకు సైనిక శిక్షణ నిచ్చారు.

విజయవాడ, కర్నూలు, షోలాపూర్, చందా, గదర్, బొంబాయి మొదలైన చోట్లల్లో స్టేట్ కాంగ్రెస్ ప్రాంతీయ కార్యాలయాలు నెలకొల్పి ఉద్యమాన్ని ముందుకు నడిపించారు. సరిహద్దు పొడవునా ఎన్నో పోరాట శిబిరాలు నెలకొల్పి కార్యకర్తలకు ఆయుధ శిక్షణ నిచ్చి సాయుధ పోరాటాన్ని కూడా కొనసాగించారు.

విజయవాడలో అయ్యదేవర కాళేశ్వరరావు భవనంలో స్టేటు కాంగ్రెస్ పోరాట కార్యాలయం నెలకొల్పారు. ఉద్యమానికి టి. హయగ్రీవాచారి ఇన్‌చార్జీగా వ్యవహరించారు.

బొమ్మకంటి సత్యనారాయణరావు, కోదాటి నారాయణ రావు, పాగా పుల్లారెడ్డి, పింగళి తిరుమలరావు, తీగెల హనుమంతరావు, పండిత రుద్రదేవ్, జలగం వెంగళరావు, అవ్వా సత్యనారాయణ రావు మొదలైన వారు సరిహద్దు పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు.


టి. హయగ్రీవాచారి


బొమ్మకంటి సత్యనారాయణ


కోదాటి నారాయణరావు

అలాగే మహారాష్ట్రలో నాగపూర్, షోలాపూర్‌లలో పోరాట కార్యాలయాలు నెలకొల్పి మరాఠ్వాడలో సరిహద్దు పోరాట కార్యక్రమాలు నిర్వహించారు. నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, హైదరాబాద్ నగరానికి చెందిన ఎందరో ప్రముఖులు, కార్యకర్తలు, విద్యార్థులు ధైర్య సాహసాలతో పోరాటాలు జరిపారు.

స్టేట్ కాంగ్రెస్ పిలుపునందుకొని నిజాం దమన నీతికి నిరసనగా ఎందరో తమ ఉద్యోగాలకు రాజీనామాలిచ్చి ఉద్యమంలోకి ప్రవేశించారు. న్యాయవాదులు కోర్టులు బహిష్కరించారు. విద్యార్థులు తమ చదువులకు స్వస్తిచెప్పి ఉద్యమంలోకి దూకారు. గ్రామాధికారులెందరో తమ పదవులకు రాజీనామా చేశారు.

సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా నిజాం ప్రభుత్వానికి ఆబ్కారీ ఆదాయం వచ్చే తాటి చెట్లు నరికి వేయడం, పన్నులు చెల్లించడం నిరాకరించడం లాంటి కార్యక్రమాలు నిర్వహించారు. స్టేట్ కాంగ్రెస్ నాయకులు తెలంగాణా జిల్లాల్లో పర్యటించి సహాయ నిరాకరణోద్యమ కార్యక్రమాన్ని బాగా ప్రచారం చేశారు.

పోలీసుల దౌర్జన్యాలను, గురించి ఎప్పటికప్పుడు కర పత్రాలు వేసి ప్రజలకు యదార్థ పరిస్థితులను తెలియజేసేవారు. ఈ ప్రచార భాగంలో వల్లూరి బసవరాజు, ప్రాణేశాచారి, మాడపాటి రామచంద్రరావు, పి.వి. నరసింహారావు ప్రముఖ పాత్ర వహించారు.

**నిజాంపై బాంబు దాడి**




పి.వి. నరసింహారావు


డా॥ యం. చెన్నారెడ్డి


మాడపాటి రామచంద్రరావు

చివరికి మౌంట్ బాటెన్ కృషి వల్ల హైదరాబాద్ ఇండియన్ యూనియన్‌ల మధ్య యధాతథపు ఒడంబడిక ముసాయిదా తయారైంది. ఈ ఒడంబడిక ప్రకారం కె.ఎం. మున్షీని హైదరాబాద్‌లో తమ ఏజెంట్ జనరల్‌గా భారత ప్రభుత్వం నియమించింది. యధాతథపు ఒడంబడిక పత్రం పనికి రాకుండా పోయింది. హైదరాబాద్ ప్రభుత్వం దానిని ఉల్లంఘించసాగింది.

ఈ లోపల హైదరాబాద్ స్టేట్‌లో ఇండియన్ యూనియన్ కరెన్సీ చలామణిపై నిషేధం విధించారు.

ఒక వైపు ఇండియన్ యూనియన్‌లో ఒప్పందం కుదుర్చుకొని మరొక వైపు మీర్‌లాయక్ ప్రభుత్వం యుద్ధ సన్నాహాలు చేయసాగింది. భారత యూనియన్‌లో ఉన్న ముస్లింలు హైదరాబాద్ వచ్చి సైన్యంలో చేరవలసిందని ఖాసిం రిజ్వీ పిలుపునిచ్చాడు.

**ముస్లిం ప్రముఖుల అభ్యర్థన :**

మరోవైపు గ్రామాలపై రజాకార్ల దాడులు, అక్రమాలు పెరిగిపోయాయి. రైళ్లపై దాడులు ప్రారంభించారు. సంస్థానంలో నానాటికీ క్షీణించి పోతున్న శాంతి భద్రతలను దృష్టిలో పెట్టుకొని 1948 ఆగస్టు 13న, కొందరు ముస్లిం ప్రముఖులు ఇత్తెహాదుల్ముసల్మీన్ సంస్థనూ, మతపక్ష పాతంతో వ్యవహరిస్తున్న లాయఖలీ మంత్రి వర్గాన్ని బర్తరఫ్ చేయాలని నిజాం రాజును అభ్యర్థించారు. ఈ ముస్లిం మేధావులు లౌకిక విధానం పట్ల నమ్మకం గల ఈ నాయకులు నిజాం రాజు సక్రమమైన పంథాను అనుసరించి సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనం చేయాలని అభ్యర్థించారు.

**స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్**

**పోరాటంలో కమ్యూనిస్టుల పాత్ర:** హైదరాబాద్ రాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీకి 1939లో బీజాలు పడ్డాయి. హైదరాబాదు నగరంలోని అబిడ్స్‌లోని ఇండియా కాఫీహౌస్‌లో అఖ్తర్ హుసేన్, మఖ్దూం మొహియుద్దీన్, సయ్యద్ ఆలంఖుంద్‌మీరి, రాజబహదూర్ గౌడ్, జవ్వాద్ రజ్వీ మొదలైన యువకులు గుమి కూడి ఇష్టాగోష్టులు జరుపుకుంటూ వుండేవారు.

1935 నుండి 1942 వరకు కమ్యూనిస్టు పార్టీమీద నిషేధం వుండేది కనుక కమ్యూనిస్టు భావాలుగల అనేక మంది యువకులు అటు ఆంధ్రమహాసభలోనూ, ఇటు విద్యార్థి సంఘాలలోనూ, కార్మిక సంఘాలలోను చేరి తమ కార్యకలాపాలను ఉధృతం చేసారు.

**భూస్వాముల దోపిడీకి వ్యతిరేకంగా:** నిజాం రాష్ట్రంలో భూస్వాములదోపిడీకి వ్యతిరేకంగా రైతు కూలీలను సంఘటిత పరిచి పోరాటాలు జరపడంలో కమ్యూనిస్టులది ప్రముఖపాత్ర. నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ 1944లో కమ్యూనిస్టులు, కమ్యూనిస్టేతరులుగా చీలిపోయింది. తర్వాత గ్రామాలలో కౌలు దారుల పోరాటాలను కమ్యూనిస్టులు ఉధృతం చేశారు. నల్లగొండ, వరంగల్లు, కరీంనగరం జిల్లాలలో వీరి నాయకత్వానగల ఆంధ్రమహాసభ శాఖలు గ్రామగ్రామాన వెలిసినవి. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లా రెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, సర్వేదేవభట్ల రామనాథం మొదలైనవారు కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని చిత్తశుద్ధితో విశ్వసించి అనేక త్యాగాలు చేశారు.

భారత దేశ స్వాతంత్ర్య ప్రకటనతో తెలంగాణా రైతాంగ ఉద్యమంలో గుణాత్మకమైన మార్పు వచ్చింది. బ్రిటిష్ సామ్రాజ్య వాదులు సంస్థానాలకు స్వేచ్ఛ ఇచ్చారు. దీనినవకాశంగా తీసుకొని నైజాం నవాబు ఇండియన్ యూనియన్‌లో విలీనానికి నిరాకరించారు భారతదేశం నడిబొడ్డున స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాడు.

వెట్టి చాకిరికి వ్యతిరేక పోరాటం, కౌలురైతుల భూముల పోరాటాలు, లేవీ వ్యతిరేక పోరాటాలు, నిర్బంధ అప్పులు, పటేలు, పట్వారీల లంచగొండి సమస్యలు తీసుకొని అన్ని వర్గాల ప్రజలను ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీలు సమీకరించాయి. ప్రజలు పెద్ద ఎత్తున కదలికలో ఉన్నారు. నైజాం ప్రభుత్వం ఇండియన్ యూనియన్‌లో చేరాలనే రాజకీయ నినాదం ఉద్యమానికి జవసత్వాలు సమకూర్చింది.

స్టేటు కాంగ్రెస్‌తో సహా ఇతర రాజకీయ భావాలుగల పట్టణ మధ్య తరగతులలో సహా ప్రజలంతా నైజాం వ్యైతిరేక సత్యాగ్రహాలు చేపట్టారు. నైజాం వ్యతిరేక పోరాటానికి ఏకాభిప్రాయం వచ్చింది. జాతీయ జండాలు ఎగురవేయాలి. నైజాం ప్రభుత్వానికి పన్నుల

**నిజాంపై బాంబు దాడి**



నిరాకరణ, ఆదాయ వనరులను విచ్ఛిన్నం చేయడం, గ్రామాధికారుల రికార్డుల స్వాధీనం, రాజీనామాలకు వత్తిడి, సరిహద్దులలో వున్న కరోడ్‌గిరి (కస్టమ్స్ సుంకం వసూలు కేంద్రాలు) చౌకీల విధ్వంసం మొదలగు ప్రభుత్వ వ్యతిరేక నినాదాల మీద అందరికీ ఏకాభిప్రాయం వచ్చింది.

కాంగ్రెసు కూడా పోరాటంలో భాగస్వామి కావడంతో ప్రజలలో ఇంకా ఆత్మవిశ్వాసం పెరిగింది. ఎక్కడి వారక్కడే వందల సంఖ్యలో కదిలి తాటిచెట్లు, ఈతచెట్లూ నరికారు. దీనివల్ల నిజాంకు ఎక్సయిజు ఆదాయం తగ్గింది. కరోడ్గిరీ కేంద్రాలపై వేల మంద ప్రజలు పోయి ఆఫీసులు కూలగొట్టారు. అధికారులను తన్ని తరిమేశారు. దాంతో కస్టమ్స్ సుంకం వసూళ్ళు తగ్గిపోయాయి. నైజాం పోలీసులు వందల సంఖ్యలో గ్రామాల మీద దాడులు చేసి తాళ్ళు నరికారనో, కస్టమ్సు చౌకీలు కూల్చారనో, గ్రామ రికార్డులు ఎత్తుక పోయారనో నేరాలు మోపి వందల సంఖ్యలో ప్రజలను అరెస్టు చేసి జైళ్లకు పంపారు. జైళ్లకు పట్టుకు పోతుంటే ప్రజలలో భయంగానీ, నిరుత్సాహం గానీ కలుగక పోగా పట్టుదల పెరిగింది.

నైజాం ప్రభుత్వం ఎంత నిర్బంధం ప్రయోగించినా ఉద్యమం ఆగలేదు. పోలీస్ బలగాలు చాల లేదు. కాబట్టి మతపరంగా ప్రజలను విభజించి ఉద్యమాన్ని అణచబూనుకుంది. ప్రభుత్వం నైజాం సంస్థానంలో ఇస్లాం మతానికి ప్రమాదమొచ్చిందని ముస్లింలను రెచ్చగొట్టబూనుకుంది. ప్రభుత్వం, కాశిం రజ్వీ నాయకత్వంలో 'రజాకారు' దళాల పటిష్టానికి పూనుకున్నారు. రజాకారు అంటే స్వచ్ఛంద సైనికుడని అర్థం. ఈ రజాకార్లకు 'అనల్ మలిక్' సిద్ధాంతం ఎక్కించారు. అనల్ మలిక్ అంటే 'మేమే పాలకులం" అని అర్థం. పాలకులైన ముస్లింలకే ప్రమాదమొచ్చిందనే మత పిచ్చి ఎక్కించబడింది. ఈ రజాకార్లకు పోలీసులను జతచేసి క్యాంపులను ఏర్పాటు చేశారు. వారికి ఆయుధాలిచ్చి గ్రామాలను దోచుకోమని, స్త్రీలను చెరచమని, గ్రామాలు తగులబెట్టి ధ్వంసం చేయమని ఆదేశాలిచ్చారు. స్వేచ్ఛయిచ్చి గ్రామాల మీద తోలారు. గ్రామాల మీద దాడులు చేసి సర్వ దోపిడీకి పూనుకున్నారు.

ఒక వైపు రజాకార్లు ఊర్లలో దౌర్జన్యాలు చేస్తుంటే మరో వైపు భూస్వాముల గూండాలు రైతాంగంపై దాడులు, హత్యలు సాగించారు. దొరలు రజాకార్లకు సహకరించారు.

ఈ దౌర్జన్యాలను ఎదిరించడానికి వరంగల్ జిల్లా మానుకోట, పెద పెండ్యాల మొదలైన ప్రాంతాలలో కమ్యూనిస్టు కార్యకర్తలు పెండ్యాల రాఘవరావు, మారం రాజు జనార్ధనరావు లాంటి వారు వీటిని గట్టిగా ఎదుర్కొన్నారు. అరెస్టు కాబడి జైలు పాలయ్యారు. ఆనాడు వీరుజాల్నా, వరంగల్ జైళ్లలో శిక్షననుభవించారు.

**స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్**

ఆయుధాలు లేకుండా ఈ రజాకారుల విధ్వంసం ఆపలేమని ప్రజలు నిర్ధారణ కొచ్చి సాయుధపోరాటం తప్ప మరొక మార్గం లేదనుకొన్నారు. పరిస్థితుల ప్రభావానికి వెనకబడితే ఉద్యమాన్ని కాపాడుకోలేమనే విషయాన్ని ఉద్యమకారులు స్వానుభవంతో నేర్చుకున్నారు.

మఖ్దూం మొహియుద్దీన్

రావి నారాయణ రెడ్డి

**సోషలిస్టు పార్టీ పాత్ర ::**

అఖిల భారత జాతీయ కాంగ్రెస్‌లో సోషలిస్టు పార్టీ అంతర్భాగంగా పనిచేసేది. దీనిని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ అనేవారు. భారత జాతీయ పోరాటాన్ని తీవ్రం చెయ్యడం, కార్మికులు, కర్షకులను స్వాతంత్ర్య పోరాటానికి సమాయత్త పరచటం, వారి హక్కుల కొరకు ఆందోళన జరపటం, బ్రిటిష్ సామ్రాజ్యాధిపతులలో ఎటువంటి రాజీ లేకుండా స్వాతంత్ర్య పోరాటాన్ని ఉధృత పరచటం వంటి కార్యక్రమాలు చేపట్టి సోషలిస్టు కార్యకర్తలు పెద్ద ఎత్తున ఉద్యమాలు నిర్వహించారు.

బి.యస్. మహదేవ్ సింగ్

ఎస్.బి. గిరి

సత్యనారాయణరెడ్డి

నిజాంపై బాంబు దాడి



1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమంలోనూ. 1947 నాటి హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలి" అనే పోరాటంలోను, సత్యాగ్రహోద్యమాలలోనూ పాల్గొని ప్రముఖ పాత్ర నిర్వహించారు.

కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్, వరంగల్ జిల్లాలకు సంబంధించి ఎందరో సోషలిస్టు కార్యకర్తలు పోరాట శిబిరాలలో పని చేసి సాయుధ పోరాటంలోనూ ప్రముఖ పాత్ర నిర్వహించారు. 1947లో జయప్రకాశ్ నారాయణ్ హైదరాబాద్ వచ్చినప్పుడు ప్రభుత్వం ఆయనను నిర్భంధించి సంస్థానం వెలుపలికి పంపించి వేసింది. నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో సోషలిస్టు పాత్ర చరిత్రాత్మకమైనది. మహదేవ్ సింగ్, ఎల్. నారాయణ, ఎస్.బి. గిరి, జె. గౌతమ రావు, వై. శివరామ శాస్త్రి, శ్రీరాములు, బి. రాజారాం, ఎం. నాగప్ప, మాధవరెడ్డి, ఎన్. సత్యనారాయణరెడ్డి, బోనాల కిషన్‌రావు, ఎన్. శంకర్‌రావు, టి. వెంకటరావు, బద్రి విశాల్‌పిట్టి, ఇ. పద్మనాభం లాంటి ప్రముఖులు ఈ ఉద్యమానికి ఊతమిచ్చారు.

**విద్యార్థి కాంగ్రెస్:**

అలాగే విద్యార్థి కాంగ్రెస్‌లో బాబురావు వర్మ, బి. నాగేశ్వరరావు, సి.హెచ్. ఆచార్య, జి. నారాయణరావు, ఎం.వి. రంగారెడ్డి, ఇరివెంటి కృష్ణమూర్తి, సి.వి. చారి, మొదలైన వారు క్రియాశీల పాత్ర నిర్వహించారు. అనేక పోరాట కార్యక్రమాలలో కాంగ్రెస్ సోషలిస్టులు కలిసి పనిచేశారు.

బాబూరావు వర్మ

సి.వి. చారి

సి. మాధవరెడ్డి

స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్


బోనాల కిషన్ రావు


ఎన్. శంకరరావు


టి. వెంకటరావు

**విద్యార్థి ఉద్యమం :**

నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా విద్యార్థులు జరిపిన ఉద్యమం అమోఘమైంది. ఆనాటి ఉద్యమంలో పాల్గొన్న యువకులు, విద్యార్థులు తమ తమ చదువులకు స్వస్తి చెప్పారు. స్వాతంత్ర్యమో, వీర స్వర్గమో అన్న తీరులో మెదిలారు.

వివేక వర్ధనీ విద్యాలయంద్వారా గణేష్ ఉత్సవాల నిర్వహణ ద్వారా, విద్యార్థులలో నూతనోత్సాహం కలిగింది. పొరుగు రాష్ట్రాల నుండి వచ్చిన పెద్దల ఉపన్యాసాలు వీరిని ఎంతగానో ప్రభావితంచేశాయి. సంఘ సంస్కరణ, నిర్మలమైన వ్యక్తిగత జీవితం ధ్యేయంగా ఆర్య సమాజం వారు వారం వారం జరిపే సత్సంగ సమావేశాలు, వార్షిక మహాసభలు, విద్యార్థులను కార్యోన్ముఖులను చేశాయి.

అంతే కాదు తెలంగాణా ప్రాంతంలో 1920 నాటి నుండి ఆరంభమైన ఆంధ్ర మహాసభలు ఇక్కడి విద్యార్థులకు భాషావిషయంగా, సాంఘిక, రాజకీయంగా శిక్షణ శిబిరాలు అయ్యాయి. ఆ రోజుల్లో విద్యార్థుల్లో, యువకుల్లో పెల్లుబికిన ఉత్సాహమే వేరు. ఆంధ్ర మహాసభలు జరిగిన సందర్భంగా వీరు వాలంటీర్లుగా పని చేశారు. రెండవ ఆంధ్ర మహాసభ సందర్భంలో రావి నారాయణరెడ్డి ఆధ్వర్యంలో రెడ్డి హాస్టల్ నుండి పదిమంది విద్యార్థులు కాలినడకన నగరం నుండి దేవరకొండ వరకూ గ్రామ గ్రామాన ప్రచారం చేస్తూ, ప్రబోధాలు చేస్తూ వెళ్లారు.

అలాగే ఆయా గ్రామాల్లో గ్రంథాలయాల ఏర్పాటుకు అవిరళ కృషి చేశారు.

1938లో నిజాం రాష్ట్ర రాజకీయ వాతావరణం అల్లకల్లోలంగా ఉండింది. స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం యువ హృదయాల మీద చెరగని ముద్ర వేసింది. సామ్యవాద భావాలు యువతరాన్ని ఎక్కువగా ఆకర్షించాయి. నాటి సోషలిస్టు నాయకుడు జయప్రకాశ్ నారాయణ్





గారి హైదరాబాద్ పర్యటన విద్యార్థుల్లో ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. వారిని రాజకీయంగా మేల్కొలిపింది.

దేశంలోని రాజకీయ పరిణామాల పట్ల కూడా యువకులు ఆసక్తి కనబర చారు. "ఆజాద్ హింద్ ఫౌజ్" సైనికులను బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించినందుకు విద్యార్థులు హైదరాబాద్‌లో బ్రహ్మాండమైన ఊరేగింపు తీశారు.

1942 క్విట్ ఇండియా తీర్మానాన్ని బలపరుస్తూ తీసుకోవలసిన చర్యలను గూర్చి ఆలోచించడానికి విద్యార్థులు నగరంలో అనేక ప్రాంతాల్లో రహస్య సమావేశాలను జరిపారు. వివేకవర్ధినీ, కేశవ మెమొరియల్ మొదలైన జాతీయ ప్రైవేట్ పాఠశాలల నుండి విద్యార్థులు వేల సంఖ్యలో ఊరేగింపులు తీశారు. నిజాంకాలేజీ విద్యార్థులు వేల సంఖ్యలో ఊరేగింపును ప్రారంభించినప్పుడు పోలీసులు జోక్యం చేసుకొని కాలేజీ ఆవరణలోకి చొచ్చుకొని వచ్చి విద్యార్థులను చెదర గొట్టడానికి లాఠీ ప్రయోగం చేశారు.


హీరాలాల్ మోరియా


ఎం.ఎల్. నరసింహారావు


శ్రీరాములుఆమిద్యాల

ఆ రోజుల్లో సరోజినీ నాయుడు గారి కుమార్తె లీలామణి నాయుడు అక్కడ అధ్యాపకురాలుగా ఉండేవారు. విద్యార్థుల మీద పోలీసులు దౌర్జన్యం చేయడం ఆమె సహించలేక బహిరంగంగా తమ నిరసనను తెలియజేశారు.

1947లో బెంగుళూరులో జరిగిన అఖిల భారత విద్యార్థి కాంగ్రెస్ సమావేశం ఇక్కడి విద్యార్థులను బాగా ప్రభావితం చేసింది. అప్పుడే విద్యార్థి సంఘం రెండుగా చీలింది. ఒక వర్గానికి నరేంద్ర గోయల్ అధ్యక్షులు, శ్రీరాములు ఆమిద్యాల ఉపాధ్యక్షులు. వీరు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌కు ఒక విద్యార్థి విభాగంగా, స్వామి రామానందతీర్థ గారి ఆధ్వర్యంలో కార్యక్రమాలు సాగించే విద్యార్థి సంస్థను నడిపారు.

1947 సెప్టెంబర్‌లో విజయవాడలో అఖిల భారత విద్యార్థి సమావేశాలు జరిగాయి. "ఈ సమావేశంలో "స్వాతంత్ర్యం సిద్ధించే వరకు విద్యార్థులందరూ పాఠశాలలు, కళాశాలలు బహిష్కరించాలని తీర్మానించారు. ఇక్కడ ఈ తీర్మానాన్ని శ్రీరాములు నరసింగరావు

ఏకగ్రీవంగా ఆమోదించారు.

1947 జులై 30న పండిత నరేంద్రజీ అరెస్టు చేసినందుకు నిరసనగా విద్యార్థులు పెద్ద ఊరేగింపు తీశారు. పోలీసులు విద్యార్థులపై లాఠీ చార్జీ చేశారు. భాష్ప వాయువు ప్రయోగించారు. అప్పుడు జగన్నాథరెడ్డి అనే విద్యార్థి తీవ్రంగా గాయపడి స్పృహ తప్పి పడిపోయాడు.

1947 ఆగస్టు7న జాతీయ పతాకాన్ని ఆవిష్కరించే కార్యక్రమంలో తెలంగాణాలోని అన్ని జిల్లాల్లోనూ, హైదరాబాద్‌లోనూ పతాకాన్ని ఆవిష్కరించి విద్యార్థులు, ఎందరో యువకులు అరెస్టయ్యారు.

1947 ఆగస్టు 15న దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని హైదరాబాద్ రాష్ట్ర వాసులకు అది చీకటి దినంగా మిగిలిపోయింది. అయినా విద్యార్థులు నిజాం ఆజ్ఞలను దిక్కరించి ముఖ్యమైన ప్రదేశాల్లో జాతీయ జెండాను ఎగురవేసి అరెస్టయ్యారు.

కాగా 1947 సెప్టెంబర్ 2న పతాక దినోత్సవం జరుపబడింది. అప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కళాశాల భవనంపై విద్యార్థులు పోలీసులను ఎదిరించి జెండాను ఎగురవేశారు. ఎందరో అరెస్టయ్యారు. రాష్ట్రంలో మరెన్నో ప్రాంతాల్లోని విద్యార్థులు జెండాలు పట్టుకొని అరెస్టయ్యారు.

హైదరాబాద్ రాష్ట్రంలో అశోకచక్రాంకితమైన జాతీయ జెండాను పట్టుకొని నగర వీధుల్లో ఊరేగుతూవుంటే కింగ్‌కోఠీ (నిజాం రాజప్రసాదం) కంపించిపోయింది.

**విప్లవకారుల పాత్ర :**

నిజాం రాజు ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థకు పరోక్షంగా తన పూర్తి మద్దతు నిచ్చాడు. కోడి పెట్ట మెడకాయ విరిచి వేసినట్లు నిజాం రాజును వ్యతిరేకించిన వారి మెడలు విరిచి వేయగలమని ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకులు తమ ప్రసంగాలలో హెచ్చరించారు.

ఇలాంటి ఉద్రేక పూరిత ప్రసంగాలు విన్న యువకుల రక్తం ఆవేశంతో ఉప్పొంగిపోయింది. కొందరు విప్లవ భావాలు గల యువకులు రహస్య స్థలంలో సమావేశమయ్యారు. వారు నారాయణరావు పవార్, జగదీష్ ఆర్య, బాలకృష్ణ, నారాయణస్వామి, గంగారాం మొదలైనవారు.

సంస్థానంలో జరుగుతున్న హింసా కాండను ఎదిరించే వారు కూడా ఉన్నారని చాటి చెప్పడమే వారి ధ్యేయం.

★☆★





## యధా తథపు ఒప్పందం :

1947 జూన్ 26న నిజాం ఫర్మానా జారీ చేస్తూ రాజ్యాంగ పరిషత్‌లో హైదరాబాద్ సంస్థానంలో పాల్గొనదని, భారత యూనియన్‌లో చేరబోదని ప్రకటించాడు. బ్రిటిష్ సామ్రాజ్యం అంతమబడంతో స్వాతంత్ర్యం ప్రకటించే అధికారం తనకుందని పేర్కొన్నాడు.

రాష్ట్రంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చేసి భారత ప్రభుత్వంతో స్నేహ పూర్వకంగా ఉండాలన్న అప్పటిన సంస్థాన ప్రధాన మంత్రి సర్ మిర్జా ఇస్మాయిల్ సూచన నవాబుకు నచ్చలేదు. మిర్జా ఇస్మాయిల్‌ను తొలగించి ఛత్తారీ నవాబును ప్రధాన మంత్రిగా నియమించాడు. నిజాం విజ్ఞప్తి మేరకు సమస్యను సామరస్యంగా పరిష్కరించుకోవడానికి భారత ప్రభుత్వం రెండు నెలల గడువు ఇచ్చింది. అనేక సంప్రదింపుల తర్వాత 1947 6 అక్టోబర్ 18న ముసాయిదా ఒప్పందం కుదిరింది.

ఒప్పందం పత్రంతో ఢిల్లీ బయలుదేరిన ప్రతినిధి వర్గానికి అక్టోబర్ 27న రజాకార్ల దళాలు అడ్డుపడ్డాయి.

ఎట్టకేలకు 1947 నవంబర్ 29న యధాతథపు ఒప్పందం మీద సంతకాలు జరిగాయి. మిగతా ఏ సంస్థానం విషయంలోనూ భారత ప్రభుత్వం అంగీకరించిందని ప్రత్యేక షరతులతో ఈ ఒప్పందం కుదిరింది. ఒప్పందం ప్రకారం హైదరాబాద్ సంస్థాన రక్షణ, వదేశీవ్యవహారాలు భారత ప్రభువ్వ ఆధీనంలో ఉంటాయి. ఒప్పందం ఫలితంగా కాంగ్రెస్ నాయకులు జైలు నుండి విడుదలయ్యారు.

## ఆపరేషన్ పోలో:

సైనాధికారి చర్యను "ఆపరేషన్ పోలో"గా వ్యవహరించారు. వేలాది కాంగ్రెస్ కార్యకర్తలు మిలిటరీ పోలీసులకు అండగా వ్యవహరించారు. 1948 సెప్టెంబరు 17న నిజాం సైన్యం కేంద్ర ప్రభుత్వానికి లొంగిపోయింది.

# 9. ఆనాటి ఉద్యమంలో కవులు రచయితలు

నిజాం నిరంకుశ వ్యతిరేకోద్యమంలో ఎందరో కవులు, రచయితలు-ప్రముఖ పాత్ర వహించారు. వారు తమ కవితలు, రచనల ద్వారా ప్రజల్లో జాగృతిని కలిగించటమే కాక తాము స్వయంగా సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని జైలుకెళ్ళారు.

అలాంటి వారిలో ముఖ్యంగా పేర్కొనదగినవారు -

స్వాతంత్ర్య నమరంలో పాల్గొని కారాగార శిక్షననుభవించిన దాశరథి (కృష్ణమాచార్యులు) నిజాం పైశాచిక ప్రభుత్వంపై ఇలా అగ్ని వర్షం కురిపించారు.

"ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగలను త్రెంచి అగ్నిలో దించినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ- అంటూ నిజాంను అభిశసించారు.

అట్లాగే కాళోజీ నారాయణరావుగారు -

"మనకొంపలార్చి మన స్త్రీలను చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మాన వాధములను మండలాధీశులను
మరచి పోకుండా గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలె
కాలంబురాగానె కాటేసి తీరాలె" అంటూ తెలంగాణ ప్రజలను సమరానికి అయత్తం చేశాడు.

ఇంకా సుద్దాల హన్మంతు లాంటి కవులూ, హీరాలాల్ మోరియ, డా॥ దాశరథి రంగాచార్య లాంటి రచయితలూ నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా రచనలు చేసి ప్రజల్ని జాగృత పరిచారు.

**ప్రజలను చైతన్య పరచిన గ్రంథాలు, పత్రికలు :**

ప్రజలకు సంస్థానంలోని పరిస్థితులను తెలిసి వారిని జాగృత పరచడానికి ఆనాడు కొన్ని పత్రికలు విశేషంగా కృషి చేశాయి. ఇక్కడి ప్రజలకు వారి మాతృభాష లోనే తెలుపడానికి కృషి చేశారు. కొన్ని పుస్తకాలూ వెలువడ్డాయి. 70 పేజీల గ్రంథాన్ని 'అణా'కే అందేజేశారు. దీని వ్యవస్థాపకుడు కె.సి. గుప్తా. దీని సంపాదకులు వెల్దుర్తి మాణిక్యరావు. దీనికి ముందుమాట





మాడపాటి హనుమంతరావు పంతులు రాశారు. ఆ తరువాత ఈ సంస్థ 'రైతు"అనే పుస్తకాన్ని కూడా ప్రచురింపజేసింది.

జాగీరు ప్రజలు, సంక్షిప్త హిందూ చరిత్ర, కాంగ్రెసు చరిత్ర, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, సావర్కర్, ఎం.ఎన్. రాయ్ వంటి మహనీయుల జీవిత చరిత్రలు కూడ వెలువడ్డాయి.

1926లో 'గోలకొండ పత్రిక" ప్రారంభమైంది. ఈ పత్రిక ఆంధ్రోద్యమానికి పెట్టని కోటగా ఉద్యమ వికాసానికి తోడ్పడింది.


సురవరం ప్రతాపరెడ్డి


దాశరథి


కాళోజీ

సంస్థానంలో జరిగే విషయాలను ఎప్పటికప్పుడు తెలియజెయ్యడానికి కాంగ్రెస్ సంస్థ పక్షాన "సారథి" అనే పేరుతో ఒక జాతీయ వార పత్రికను నెలకొల్పారు. దీనిని విజయవాడ నుంచి ప్రచురించేవారు. దీని ప్రతులను అతి రహస్యంగా తెలంగాణా ప్రాంతానికి చేరవేసేవారు. దీని సంపాదకులు తాళ్లూరి రామానుజస్వామి, డి. రామలింగం, సి.హెచ్. కొండయ్య, మాడపాటి వినయకుమార్ లాంటి వారు ఇందులో పనిచేశారు.

సూర్యదేవర రాజ్యలక్ష్మి సంపాదకత్వంలో ఒక పత్రిక, డా॥ఎం. చెన్నారెడ్డి ఆధ్వర్యంలో "హైద్రాబాద్" అనే మరో పత్రిక వెలువడ్డాయి. వీటిల్లో స్టేట్ కాంగ్రెస్ పోరాట కార్యక్రమాన్ని ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియజేసేవారు.

మహర్షి దయానందుల వారి జీవిత చరిత్రను ఆర్యసమాజ్ సభ సందర్భంగా ప్రకటించారు.

అలాగే వట్టికోట ఆళ్వారుస్వామి రెండు పుస్తకాలను ప్రచురింపచేశారు. ప్రజల మనిషి, గంగు అనే నవలలు హైదరాబాదు రాజకీయ వాతావరణాన్ని చక్కగా ప్రతిబింబింపచేశాయి.

1940లో స్టేట్ కాంగ్రెస్ ప్రముఖ నాయకుడైన కొమరగిరి నారాయణరావు నిషేధింపబడిన పుస్తకాన్ని తెలుగులోకి అనువదించి ప్రచురించారు. ప్రెస్ నుండి రాక ముందే ప్రభుత్వం దీనిని నిషేధించింది.

★☆★

# 10. పోరాట తుది ఘట్టం

రాష్ట్రాన్ని భారత యూనియన్‌లో కలిపివేసి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటం తప్ప వేరే మార్గం లేదని రామానందతీర్థతో సహా నాయకులంతా ఒక నిర్ణయానికి వచ్చారు. స్వతంత్ర భారతదేశంలో ఇప్పటి సంస్థానాలన్నీ విలీనం కావాలనే దొక్కటే స్టేట్ కాంగ్రెస్ నినాదం అనీ స్వామీజీ స్పష్టంగా చెప్పారు. హైదరాబాద్ ప్రజలు జరుపుతున్న ఈ పోరాటంలో అన్ని విధాలా సహకరించాలని తద్వారా ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠం చేయాలని కోరారు.

అయితే నిజాం మాత్రం ఒక వైపు భారత ప్రభుత్వంతో సంధి ప్రయత్నాలు చేస్తూనే ప్రజలపై దౌర్జన్యాలు సాగిస్తూ పోయాడు. స్థానిక ముస్లిం రౌడీలకు నైజాం బయటి నుంచి తెప్పించుకున్న మతోన్మాదులు తోడయ్యారు. కాని వారు గ్రామాల మీద పడి పట్ట పగలు విచ్చల విడిగా దోపిడీలు జరిపారు. పోలీసులు ఇటు రజాకార్లను, ముస్లిం కాందిశీకుల తోను కుమ్మక్కై, గ్రామాలను దోచే కార్యక్రమాన్ని ఉధృతం చేశారు. రాక్షసాధములైన వీరు మానభంగాలు చేయటంలో నిమగ్నమయ్యేవారు.

ఇలాంటి దుర్మార్గులకు బలికాని గ్రామమంటూ ఆనాడు లేనే లేదు. ఇలా వీరు ప్రజలను భయభ్రాంతులను చేస్తే కాంగ్రెస్ వారు తమ ఉద్యమాన్ని మానుకుంటారని జైలులో మాఫినామాలిచ్చుకుంటారని నిజాం భావించాడు. మధ్య యుగపున ఫ్యూడల్ రాచరికానికి వారసుడైన నిజాం ఆనాటి పైశాచిక కృత్యాలను అక్షరాలా అమలు జరిపాడు. బైరాంపల్లి, రేణుకుంట, రాయికోడు, మాచిరెడ్డిపల్లి మొదలైన గ్రామాలలో నిజాం పోలీసులు, మిలిటరీ వారు రజాకార్లు చేసిన అమానుష చర్యలు, దుర్మార్గానికి పరాకాష్ఠలాంటివి. అనేక గ్రామాలలో వందలాది మందిని నిర్దాక్షిణ్యంగా కాల్చటమే కాకుండా గృహదహనాలు, అనేక మానభంగాలు విరివిగా జరిపారు.

ఇదంతావిని భారత హోం మంత్రి అయిన "ఉక్కుమనిషి" సర్దార్ వల్లభభాయి పటేల్ ఉగ్రుడయ్యారు. రాష్ట్ర మంతటా, నలుమూలలా ఇంతటి అమానుషత్వం జరుగుతుంటే భారత ప్రభుత్వం ఇక సహించబోదని పార్లమెంటులో ప్రకటించారు.





**నిజాం ద్వంద్వనీతి :**

నిజాం ఒక వైపు దౌర్జన్యం సాగిస్తూనే మరోవైపు తన ప్రధాన బేరాలు సాగించాడు. వేరొకవైపు ఇండియాతో సంధిచేసుకోరాదని గోల పెట్టవలసిందిగా మజ్లిస్ వారిని ఎగవేశాడు. కానీ గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ బాటెన్ చేసిన తుది హెచ్చరికతో అదిరిపడి, మజ్లిస్ వారికి తెలియకుండా లోపాయికారిగా తాను సంతకం చేసిన సంధిప్రయత్నాలు ఢిల్లీకి పంపాడు.

ఈ విధంగా ఎంతో తాత్సారం చేస్తూ నిజాం యథాతదపు ఒడంబడికపై సంతకం చేశాడు. ఇంతకూ ఈ ఒడంబడిక నిజాంకే అనుకూలించింది. అన్నిటికన్నా ఘోరమైననష్టం బొల్లారంలో ఉన్న భారత సైన్యం తరలించబడటం. భారత సైన్యం ఉండటం వల్ల ఇటు ప్రజలకు రక్షణ దొరుకుతుందనే ధీమా ఉండేది. అటు ప్రజలపై ఎలాంటి అత్యాచారం జరిపినా దేశంలో శాంతి భద్రతలు కాపాడటానికి భారత ప్రభుత్వం నిమిషాలలో సైన్యం తరలించవచ్చునని భయం నిజాంకు ఉండేది.

అందుకే ఒడంబడికలో సైన్యం వెంటనే తరలించాలనే షరతు నిజాం పెట్టినాడు. ఇంతటితో ఆగక రాష్ట్రంలో శాంతి భద్రతలు కాపాడటానికి అవసరమైన మందుగుండు సామగ్రి సరఫరా చేయాలని గూడ ఒడంబడికలో చేర్చటం జరిగింది.

ఇక ఇండియా సైన్యం బయటికి తరలించబడిందని నిజాం పోలీసులు, సైనికులు విశృంఖల విహారం చేయసాగారు. వారి అత్యాచారాలకు పట్ట పగ్గాలు లేకుండా పోయింది. ఈ పరిణామం పసిగట్టినది ఒక్క ప్రజానాయకుడు లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ మాత్రమే.

"హైదరాబాద్ నుండి సైన్యాన్ని తరలించి ప్రజాకోటిని నిరాశ్రయంగా చేశారు. సైన్యం తరలించటానికి ముందు కనీసం రజాకారుల దళాన్ని నిషేధించాలనే షరతు అయినా పెట్టవలసి ఉండేది" అని లోక్‌నాయక్ భారత ప్రధాని నెహ్రూగారికి, ఉప ప్రధాని పటేల్ గారికి లేఖలురాశారు. వారి దూరదృష్టి, రాజకీయ అవగాహన శ్లాఘనీయమైనది.

సైన్యాన్ని బొల్లారం నుంచి తరలించటం ఒక గొప్ప పొరపాటని భారత ప్రభుత్వం ఒప్పుకుంది. తమకు అడ్డులేదని రజాకార్ల నాయకుడు ఖాసిం రజ్వీ విజృంభించి హైదరాబాద్ వీధుల్లో తాను "సాలేం ఆజం" కమాండరుగా సైనిక దుస్తులు ధరించి కరవాలం చేతబూని వేలాది రజాకార్లతో విన్యాసం జరిపాడు.

కాగా నిజాం ప్రభుత్వం జైళ్లలో బంధించబడిన సత్యాగ్రహులమీద దాడి జరిపించి ఆటవిక ప్రభుత్వమని నిరూపించుకున్నది. నిజామాబాద్, వరంగల్, గుల్బర్గా జైళ్లలో ఉన్న సత్యాగ్రహుల మీద దాడి జరిపించే ఘోరపాపానికి ఒడిగట్టింది.

**పోరాటం ఉధృతం :**

న్యాయవాదులు కోర్టు బహిష్కరించారు. విద్యార్థులు అంతకుముందే పాఠశాలలు విడిచి సరిహద్దు పోరాటంలో ప్రత్యామ్నాయంగా ఉద్యమంలో పాల్గొన్నారు.

ఒక వైపు పంటపొలాలు బీడుబడ్డాయి. గ్రామాలు పాడుబడ్డాయి. పాఠశాలలు మూతపడ్డాయి. వ్యాపారం నిలిచి పోయింది. మొత్తం నిత్య జీవితం స్థంభించి పోయింది.



బూర్గుల రామకృష్ణారావు



కాటం లక్ష్మీనారాయణ

★☆★





# 11. పోలీసు చర్య

1948, సెప్టెంబర్ 13వ తేదీ సోమవారం తెల్లవారు జామున భారత ప్రభుత్వ సైన్యాలు హైదరాబాద్ సంస్థానంలోకి ప్రవేశించాయి. దక్షిణ ప్రాంతం కమాండింగ్-ఇన్-చీఫ్ లెఫ్టినెంటు జనరల్ మహారాజ రాజేంద్రసింగ్‌జీ ఆధిపత్యాన హైదరాబాద్ సంస్థానం మూడు వైపుల నుంచి భారత సైన్యాలు చుట్టుముట్టి సరిహద్దులు దాటాయి. హైదరాబాద్ సైన్యాలు, రజాకారు మూకలు మొదటి రోజు ప్రతిఘటించాయి. కాని భారత సైనికుల ధాటికి తట్టుకోలేక అపారమైన నష్టంతో వెనుకంజ వేశాయి. భారత సైన్యాలు ఒక్కొక్క పట్టణాన్ని ఆక్రమించుకుంటూ స్వల్ప ప్రతిఘటనను ఎదుర్కొంటూ ముందుకు చొచ్చుకొని పోయాయి.

ప్రజలు దారి పొడవునా గ్రామాలలో, పట్టణాలలో భారత సైన్యాలకు అఖండ 'స్వాగతం పలికారు. ప్రజల ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. తరతరాల నుంచి నిజాం నిరంకుశ పరిపాలన కింద నలిగిపోతూ వచ్చిన జనావళికి విముక్తి లభించింది.

సెప్టెంబర్ 13వ తేదీన పోలీసు చర్య ఆరంభమై ముచ్చటగా నాలుగో రోజున జహీరాబాద్ పట్టణం భారత సైనికుల వశమైంది. అటు పర్భనీ జిల్లాలోని హింగోలీకి భారత సైన్యాలు చేరుకున్నాయి. ఇలా అన్ని చోట్లా నిజాం సేనలు మట్టిగరచి పారిపోయాయి.

సైన్యం హైదరాబాదు భూభాగంలోకి వాయువేగంగా ప్రవేశించాయి.

సెప్టెంబర్ 17వ తేదీన హైదరాబాద్ సైన్యాలు పూర్తిగా యుద్ధరంగం నుంచి విష్క్రమించి భారత సైన్యానికి దాసోహమ్మన్నాయి. నిజాం రాజు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ తాను బేషరతుగా లొంగిపోయినట్లు ప్రకటించాడు.

ఎర్రకోట మీద ఆసఫియా పతాకం ఎగురవేస్తామని ప్రగల్భాలు పలికిన రజాకార్ నాయకుడు ఖాసిం రజ్వీ ప్రగల్భాలు, నెహ్రూ పటేల్‌లను పట్టుకు వచ్చి ఉస్మాన్ అలీఖాన్ కాళ్లపై పడవేస్తామనే మేక పోతు గాంభీర్యం మేకలా బలిపశువుగా మిగలిపోయింది.




ఉస్మాన్ అలీఖాన్ లొంగిపోయిన దృశ్యం

★☆★





# 12. నిరంకుశత్వాన్ని నిరసించిన పోరాట యోధుడు

నిజాం నిరంకుశ విధానం రోజు రోజుకూ తీవ్రమౌతూవచ్చింది. రజాకార్ల దౌర్జన్యాలు మితిమీరసాగాయి. నిజాం పాలనలోని ఈ కిరాతకాలను ఇక భరించలేమంటూ యువతరం సమరానికి సిద్ధమైంది. ప్రాణాలను బలియిచ్చి అయినా నిజాం నిరంకుశత్వ పాలన నుండి బయటపడాలనుకుంది ప్రజానీకం. యువకిశోరాల్లో రక్తం ఉప్పొంగింది. నిజాం పాలనలో సాగిన అణచివేత, మత వివక్ష, రజాకార్ల దోపిడీ, హింసాకాండలకు విసిగి వేసారిన జనం ప్రాణాలకు సైతం తెగించి నిజాంపై సమరం సాగించారు.

ఇలా ప్రాణాలకు తెగించిన యువకుల్లో నారాయణరావు పవార్ అనే యువకుణ్ణి గూర్చి ప్రముఖంగా చెప్పుకోవలసి ఉంది.

**నారాయణరావు పవార్ జీవన క్రమం :**

నారాయణరావు పవార్ వరంగల్ పట్టణం (గోవిందరాజుల గుట్ట ప్రాంతం)లో 1926 మార్చి 3న ఒక నిరుపేద కుటుంబంలో జన్మించారు.

తండ్రి : పండరీనాథ్ రావు పవార్

తల్లి : అనసూయాబాయి

భార్య : విజయాలక్ష్మి పవార్

సంతానం - ముగ్గు అబ్బాయిలు - ప్రభాకరరావు పవార్ - భార్య సంధ్య, సుధాకరరావు పవార్ - భార్య సురేఖ, మధూకరరావు పవార్ - మిథుల.

మధూకరరావు పవార్ ఆయన భార్య - ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లుగా అమెరికాలో ఉంటున్నారు.

ముగ్గురు అమ్మాయిలు - పెద్దమ్మాయి చనిపోయింది. మూడవ అమ్మాయి కమలా పవార్ డాక్టర్ - ఆవిడ భర్త రవీ పవార్.

2వ తరగతి వరకు ఆయన బావగారైన జనార్ధనరావు షిండే వద్ద ఉర్దూ చదువుకున్నాడు. ఈయన బావగారు 10వ తరగతి వరకు చదువుకొని వరంగల్ అజంజాహీ మిల్లులో టైం కీపర్‌గా పనిచేసేవారు. అప్పుడు ఆజంజాహీ మిల్‌లో 2000 మంది కార్మికులు

పని చేసేవారు.

నారాయణరావు పవార్ 3వ తరగతి నుండి 7వ తరగతి వరకు మట్టెవాడ ప్రభుత్వ హైస్కూలులో చదువు కున్నాడు. 8వ తరగతి నుండి ఇంటర్ వరకు హన్మకొండలోని గవర్నమెంట్ కాలేజీయేట్ హైస్కూలులో ఆయన విద్య కొనసాగింది. 1942లో మెట్రిక్, 1944లో ఇంటర్ ప్యాసయ్యారు.

లా చదువుకుని న్యాయవాది అవ్వాలనేది ఆయన చిన్ననాటి కోరిక.

తండ్రి పండరీనాథరావు పూర్వీకులు కర్నాటకలోని గుల్బర్గా ప్రాంతానికి చెందినవారు. అప్పుడు తెలంగాణాలో మహారాష్ట్రలోని కొన్ని జిల్లాలు, కర్ణాటకలోని కొన్ని జిల్లాలు కలిసి ఉండేవి. అలా వీరి కుటుంబం కర్ణాటక నుండి బ్రతుకు దెరువుకోసం హైదరాబాద్ రాష్ట్రానికి చేరుకుంది.

తండ్రి పండరీనాథ్‌రావు వరంగల్ రైల్వేస్టేషన్‌లో గూడ్స్ సెక్షన్‌లో హమాలీగా పని చేసేవారు. అలా నారాయణరావు పవార్ ఒక కూలీ కుటుంబం నుండి వచ్చి నిజాం నవాబునే గడ గడ లాడించిన స్థాయికి చేరుకున్నాడు.

అప్పుడు అంటే రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో వరంగల్ లాంటి ఎన్నో స్టేషన్లలో (ARP) Rade Precaution Department సెంటర్ ఉండేది. ఈ సెంటర్లు విమానాల ప్రమాదాలను ముందుగా తెలియజేసే సెంటర్లు - తరువాత వాటిని మూసి వేశారు. (ARP) ని



స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్



Rationing Department గా మార్చి వేశారు.

1945లో ఇంటర్ పూర్తి చేసి నారాయణరావు పవార్ రేషనింగ్ డిపార్ట్‌మెంట్‌లో క్లర్క్‌గా చేరారు. నెలకు 50 రూ. పాయల వేతనం.

కాని ఆయన ఆశయం మాత్రం హైదరాబాద్ వెళ్ళి లా పూర్తి చెయ్యాలని ఉండింది. అందుకు తండ్రి ప్రోత్సాహం, సహకారం లభించింది. హైదరాబాద్ వెళ్తే భోజనం ఖర్చులు మాత్రం నేను భరిస్తాను. చదువుకయ్యే ఖర్చును నీవే సమకూర్చుకోవాలని చెప్పాడు తండ్రి.

తండ్రి చెప్పినట్లుగానే నారాయణరావు తన రెండు సంవత్సరాల నెల జీతం రూ. 50/-లను రెండు సంవత్సరాలు రూ. 1200/- పొదుపు చేసుకున్నాడు. 1946లో హైదరాబాద్ చేరుకున్నాడు.

**ఉపాధ్యాయుడిగా :**

హైదరాబాద్ చేరుకున్న నారాయణరావు పవార్ "ఎక్సెల్సియల్ మిడిల్ స్కూల్‌లో ఉపాధ్యాయుడిగా చేరాడు. ఈ మిడిల్ స్కూల్ ఆ రోజుల్లో వివేక వర్ధనీ పాఠశాలకు బ్రాంచి స్కూల్‌గా ఉండేది.

ఉదయం ఉపాధ్యాయునిగా చేస్తూ సాయంత్రవేళలో లా క్లాసులకు అటెండ్ అయ్యేవాడు నారాయణరావు.

హైదరాబాద్‌లో ఉస్మానియా ఆస్పత్రి వెనక భాగంలో మిత్రుడు బాల్ కిషన్ ఇంట్లో ఓ గదిలో ఉండేవాడు. మిత్రుడు బాల్ కిషన్ తమ్ముడు నారాయణరావు పని చేసే ఎక్సెల్సియల్ స్కూల్లో చదివేవాడు. ఆ అబ్బాయికి ట్యూషన్ చెబుతుండేవాడు. అందువల్ల ఇంటి కిరాయి కూడా చెల్లించవలసిన అవసరం ఏర్పడలేదు.

మిత్రుడు బాల్ కిషన్ టేలరింగ్ చేసేవాడు. ఆ ప్రాంతంలో ఉన్న ఒక వైశ్య హోటల్‌లో నారాయణ రావు భోంచేసేవాడు.

★☆★

స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్

# 13. నారాయణరావు పవార్ జీవితాన్ని మలుపు తిప్పిన సంఘటనలు

**ఆర్యసమాజ్ కార్యకర్తగా ?**

ఆ రోజుల్లో పండిత నరేంద్రజీ గొప్ప ఆర్య సమాజ్ కార్యకర్త-గొప్ప వక్త-ఆయన ఉపన్యాసానికి ఆ రోజుల్లో ఎందరో స్ఫూర్తిచెందేవారు. పండిత నరేంద్రజీ ఒక సారి వరంగల్ వచ్చి గొప్ప ఉపన్యాసాన్ని ఇచ్చారు. ఆయన ఉపన్యాసానికి ఎందరో ప్రభావితులై ఆర్య సమాజం పట్ల ఆకర్షితులై ఆర్య సమాజ్ కార్యకర్తలయ్యారు. ఆర్యసమాజ్‌లో కొన్ని నియమాలు, నిబంధనలున్నాయి. కార్యకర్తలు ఈ నియమాలను పాటించవలసిందే. ఈ నియమాలు వ్యక్తులు తమ వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకోడానికి బాగా ఉపయోగపడ్డాయి.

వైదిక సిద్ధాంతాల గురించి పండిత నరేంద్రజీకి ఉన్న పరిజ్ఞానం అపారమైంది. ఆయన ప్రసంగాలు ఉపదేశాలకు ఎందరో యువకులు ఆకర్షితులై ఆర్యసమాజ్‌లో సభ్యులుగా చేరారు. అలా ఆకర్షితులైన వారిలో నారాయణ రావు పవార్ ఒకరు. పవార్ హైదరాబాదులో జరిగే ఆర్యసమాజ్ కార్యక్రమాల్లో పాల్గొనేవారు.

సంస్థానంలో హిందూ ప్రజలలో ఆత్మ విశ్వాసం కలిగించడానికి ఆర్య సమాజ్ బాగా తోడ్పడింది. మతోన్మాదుల దురాగతాల నుంచి హిందువులను కాపాడి, వారు ఆత్మ సంరక్షణ చేసుకోవడంలో ఆర్య సమాజ్ మహత్తర పాత్ర నిర్వహించింది. ఆ రోజుల్లో హైదరాబాద్ నగరంలో ఆర్యసమాజ్ నాయకులు ఇద్దరు ఉండేవారు. ఒకరు కేశవరావు కొరట్కర్, రెండోవారు చందులాల్ ఆర్యా - హైదరాబాద్ నగరంలో వీరిద్దరి పేర్లు బాగా ప్రచారంలో ఉండేవి.

**ఒక ఆర్య సమాజ్ కార్యకర్తలో విప్లవ బీజాలు ఎలా మొలకెత్తాయి ?**

ఆర్యసమాజ్ ఉద్యమం దినదిన ప్రవర్ధమానంగా సాగింది. ఇది నిజాం ప్రభుత్వానికి కంటకప్రాయమైంది. ప్రభుత్వం ఇత్తెహాదుల్ముసల్మీన్ నాయకులను ప్రేరేపించి ఎన్నో అత్యాచారాలు, అనాచారాలను చేయించింది. ప్రభుత్వ అధికారుల మద్దతు, పోలీసుల అండదండలతో ఇత్తెహాదుల్ముసల్మీన్ కార్యకర్తలు ఆర్యసమాజ్ కార్యకర్తలపై ఎన్నో విధాల దౌర్జన్యాలు చేశారు. గుండాలను ప్రోత్సహించి సభలను భగ్నం చేయించారు.

ఈ పోరాటంలో ఎందరో యువకులు సాహసోపేతంగా ఎదురొడ్డి తమ ప్రాణాలు





కూడా బలియిచ్చారు. పండిత నరేంద్రజీ గ్రామ గ్రామం తిరిగి ఆర్య సమాజ్ సిద్ధాంతాలను, ఆశయాలను ప్రచారం చేయసాగాడు. అయితే ఎన్నో సందర్భాలలో ఆయనపై దౌర్జన్యం జరిగింది. ఆయనను అంతమొందించడానికి కూడా ప్రయత్నాలు జరిగాయి. దైవ కృపవల్ల అయన పలు సందర్భాలలో మృత్యుముఖం నుండి బయట పడ్డారు.

కాగా ప్రభుత్వం కొత్త కొత్త హుకుంలను ఆదేశాలను జారీ చేయసాగింది. వ్యాయామ శాలలు, ప్రైవేట్ పాఠశాలలు, గ్రంథాలయాలు నెలకొల్పుకునే విషయంలో కూడా కఠిన నిబంధనలు అమలు చేసింది.

వీటి పట్ల ఆర్య సమాజీయులు విసుగు చెందారు. నిజాంపై ద్వేషాన్ని మరీ పెంచుకోసాగారు.

సత్సంగ్ క్లాసులకు వెళ్తూ, సంధ్యావందనం, హవనం లాంటి శుద్ధి కార్యక్రమాలు చేపట్టే ఆర్యసమాజ్ కార్యకర్త నారాయణరావు పవార్ లాంటి వారికి హిందూ మతవిధ్వంసాలకు పాల్పడే నిజాం ప్రభుత్వంపై రోజురోజుకూ ద్వేషం పెరగసాగింది.

**నిజాం గద్దార్ (ధేశ ద్రోహి) :**

నిజాం మొదటి నుంచి దేశద్రోహి అనే విషయం నారాయణరావులో బాగా నాటుకు పోయింది.

నిజాం భారత్‌దేశ్‌కా సబ్‌సేబడా గద్దార్‌హై (నిజాం భారతదేశానికి ద్రోహం తలపెట్టిన దేశద్రోహి) అంటూ ఉండేవారు నారాయణరావు పవార్ అనుచరులు.

టిప్పుసుల్తాన్‌కు సహాయం అందించక బ్రిటిష్ వాళ్లకు సహకరించాడు. అందుకే నిజాం పెద్ద దేశ ద్రోహి అనే వారు.

మరాఠ యుద్ధ సమయంలో మరాఠాలకు బదులుగా బ్రిటిష్ వాళ్లకు సహాయం చేశాడు. అందుకే నిజాం గద్దర్ అని అనేవారు.

**ఆర్య నవ యువక్ క్రాంతిదల్ :**

నారాయణ రావు పవార్ మరి కొందరు స్నేహితులు కలిసి "ఆర్య నవయువక్ సంఘ్'ను స్థాపించుకొన్నారు. ఈ యువక్ సంఘ్‌లోని బాల్ కిషన్ అమృతసర్ వెళ్లి అక్కడ ఆరునెలలున్నాడు. ఆయన అమృతసర్‌లో విప్లవ కారులతో పరిచయం ఏర్పరచుకొన్నాడు. బాల్‌కిషన్ ఆరునెలల తరువాత హైదరాబాద్ వస్తూ "షహీదోంకీ టోలీ" (విప్లవకారుల గ్రూప్) దళం అనే పుస్తకాన్ని తీసుకువచ్చాడు. ఈ పుస్తకంలో 44 మంది విప్లవ వీరుల జీవిత చరిత్రలున్నాయి. ఈ నవ యువక్ క్రాంతిదల్ వారు విప్లవ కారుల జీవితాలను చదివి

స్ఫూర్తి చెందారు. దేశం కోసం మన మేమైనా చెయ్యాలి. చివరికి ప్రాణాలైనా అర్పించాలి" అనే నిర్ణయానికి వచ్చారు.

కాగా హిందువులపై ముస్లింలు జరుపుతున్న అమానుష క్రియలు, హిందువులను ముస్లింలుగా (ఇస్లాం మతం లోకి) మార్చుతున్న తీరు - ముస్లిం పెద్దలు తమ ప్రసంగాలలో హిందువులను హీనాతిహీనంగా కించపరుస్తూ నోటికి వచ్చినట్లూ మాట్లాడుతున్న తీరు నారాయణరావు పవార్‌ను ఎంతగానో కలచి వేసింది.

హిందువులపై జరుగుతున్న అమానుష చర్యలు, దౌర్జన్య పూరిత చర్యలు తాను కళ్లారా చూసి విచలితుడై పోయాడు నారాయణరావు పవార్.

హైదరాబాద్ దారుస్సలాం ప్రాంతంలో మహ్మదాలీ జిన్నా ఇచ్చిన ఉపన్యాసం వీరిని ఎంతగానో కలచి వేసింది. హిందువులకు పట్టిన గతి ఏంటి? దీనికి అంతం లేదా అని బాధపడ్డారు.

**దారుస్సలాంలో విన్న ఉపన్యాసం :**

ఆ రోజు అక్కడ జరిగిన ఉపన్యాసం వినడానికి ఆయన, ఆయన మిత్రుడు బాల్‌కిషన్ మారు వేషంలో వెళ్లారు. ఇద్దరూ పైజామాలే వేసుకొని,జిన్నా క్యాప్‌లను పెట్టుకొని అచ్చం ముస్లింలుగా వెళ్లారు.

జిన్నా మహాశయుడు యిచ్చిన ఉపన్యాసం, గంట వరకు కొనసాగింది. అందులో మొత్తం హిందువులను కించపరచడం హీనంగా చూడడమే ప్రధానంగా కొనసాగింది. హిందువులందరిని ముస్లింలుగా మార్చండి. హిందువులు పాకిస్థాన్ డిమాండ్‌కు ఒప్పుకోక పోతే వారిని "గజర్ ముర్గీలను నరికినట్టుగా నరికి వేయండి అని అన్నాడు.

"కోడి మెడకాయను వంచి, త్రిప్పినట్లుగా తిప్పివేయండి" అని అన్నాడు. మారు వేషంలో ఉన్న ఈ యువకుల్లో పౌరుషం ఉప్పొంగింది. కానీ ఏం చేయడం? ఆవేశాన్ని ఎలాగో దిగమింగుకున్నారు. సరియైన సమయం కోసం కాచుక్కూర్చున్నారు. అప్పుడే వారు తమలో ఇలా ప్రతిజ్ఞ చేసుకొన్నారు? "చివరి శ్వాస వరకు నిజాంను వదలం. గద్దెదింపేస్తాం" అని ప్రతిజ్ఞ చేశారు.

పేద హిందువులుండే చోట ముస్లింలు పాగా వేసి వారిని ప్రలోభ పెట్టి ఇస్లాం మతంలో కలుపడానికి ప్రయత్నం చేసేవారు. వారి వాడల్లోనే వంటలు - బిర్యానీ వండించి పేదలకు వడ్డించి వారిని ఇస్లాం మతంలో చేరమని ప్రలోభ పెట్టేవారు.





అలా ఎందరో అమాయకులను ఇస్లాం మతంలో కలుపుకున్నారు- హిందువుల పేర్లను కూడా మార్చి వారికి ముస్లిం పేర్లను తగిలించారు.

ఆ తరువాత వీరందరినీ ఆర్య సమాజ్ పద్ధతిలో పునీతం చేసి హిందువులుగా మార్చారు.

## కళ్లారా చూసిన అమానుష సంఘటనలు :

వరంగల్‌లో మొగిలయ్య హత్య జరిగి ఆయన శరీరం నుండి ప్రవహించిన రక్తాన్ని కళ్లారా చూశాడు.

1947 ఆగస్టు 15 నాడు దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది.కాని హైదరాబాద్ రాష్ట్రం తెలంగాణా ప్రజలు మాత్రం నిజాం నిరంకుశత్వంలోనే మ్రగ్గుతున్నారు.

వరంగల్ కోటలో సాహసోపేతమైన సంఘటన జరిగింది. స్వేచ్ఛా ప్రియులు మొగిలయ్య అతని సోదరులు రామస్వామి ఆరోజున ఎలాగైనా జండాను ఎగుర వేయాలని కంకణం కట్టుకున్నారు. అక్కడి పెద్దలు టి. హయగ్రీవాచారి, కాళోజీ నారాయణరావు గారల ప్రబోధం, ప్రోత్సాహంతో యువకులను చేరదీసి జండాను ఎగుర వేయడానికి సిద్ధమయ్యారు. స్థానిక యువకులంతా ఏ త్యాగానికైనా బలి దానానికైనా సిద్ధమయ్యారు.

మొగిలయ్య సాహసంతో "బోలో జై భారత్ మాతాకీ" అంటూ జండాను ఎగుర వేశాడు. జండాకు కట్టిన తాడును బిగించడానికి అలా వంగాడు. అంతే అప్పటికే అక్కడికి చేరుకున్న లక్కీ "పహల్వాన్" అనబడే ఖాసిం హరీఫ్ 40, 50 మంది రజాకార్లు దాడి చేయడానికి సిద్ధమయ్యారు.

పిరికి పందల్లా, దొంగ చాటున జాండా తాడును కట్టడానికి వంగిన మొగులయ్యను వెనుక నుండి బర్చీతో పొడిచారు. తరవాత అదే పహల్వాన్ రామస్వామిని పొడవడానికి బల్లెంను వేశాడు. కాని ఈ లోపల రామస్వామి తప్పించుకున్నాడు. ఈ ఘర్షణలో అతని ముక్కు తెగిపోయింది. గుంపు చెదిరి పోయింది. అటు రజాకార్లు "షా ఉస్మాన్ జిందాబాద్" అని నినాదాలుచేస్తూ "లక్కీ పహల్‌వాన్"ను ఊరేగింపుగా తీసుకు వెళ్లారు.

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఈ సంఘటన జరిగిన కాస్సేపటికే అక్కడికి పోలీసు ఆఫీసర్లు చేరుకున్నారు. మొగిలయ్యను హతమార్చిన దుండగుడిని పూలహారాలతో సత్కరించారు. ఈ సంఘటన నారాయణరావ్ పవార్ అతని అనుచరుల విజయాలను ద్రవింపజేసింది.

**వరంగల్ లోనేజరిగిన మరో హృదయ విదారక సంఘటన :**

తాను కళ్లారా చూసిన ఈ హృదయ విదారక సంఘటన నారాయణరావు పవార్‌ను ఎంతగానో కలిచి వేసింది. నారాయణ రెడ్డి అనే డాక్టర్ వద్దకు వచ్చిన రజాకార్లు చికిత్స చేయమన్నారు. చికిత్స చేస్తుండగానే నిర్దాక్షిణ్యంగా పొడిచివేశారు. ఈ హత్య ఉదంతాన్ని కళ్లారా చూసిన భార్య తట్టుకోలేక వెంటనే ఆత్మహత్య చేసుకుంది.

**వరంగల్ లో నే జరిగిన మరో సంఘటన :**

వరంగల్‌కు చెందిన కిష్టయ్య నారాయణరావు క్లాస్‌మేట్. మంచి మిత్రుడు. కిష్టయ్య అన్న బ్రహ్మయ్య - రజాకార్ల ప్రాబల్యం బాగా వున్న రోజుల్లో బ్రహ్మయ్య బయటికి వచ్చి రోడ్డుపై నడుస్తున్నాడు. అలాంటి అమాయకున్ని రజాకార్లు బర్చీలతో నిర్దయగా, క్రూరంగా పొడిచారు.

ఈ హింసాత్మక, హృదయ విదారక దృశ్యం నారాయణరావ్ పవార్‌ను ఎంతో కలచి వేసింది. నిజాం ప్రభుత్వ దమన నీతికి, హింసాత్మక చర్యలకు అంతే లేదా? అనే ప్రశ్నలు నారాయణరావును పదే పదే వేదించసాగాయి.

**కళ్లారా చూసిన మరో అమానుష చర్య :**

వరగంల్ పట్టణంలోనే 7 గురు "నన్స్" క్రైస్తవ వనితలను చూస్తుండగానే వారిపై దౌర్జన్యం చేసి పాడు చేశారు.

ఈ దృశ్యాన్నీ నారాయణరావు పవార్ కళ్లారా చూశాడు.

నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా మెదలిన హిందువులందరినీ మట్టు బెట్టడమే నిజాం ప్రభుత్వం తమ చర్యగా పెట్టుకుంది.

**షోయెబ్ హత్య :**

అయితే హైదరాబాద్‌కు చెందిన పత్రికా రచయిత షోయెబుల్లాఖాన్ మాత్రం ప్రజాస్వామ్య విధానాలను బాగా జీర్ణించుకున్న పత్రికా విలేకరి, రచయిత. షొయెబ్ ఇమ్రోజ్ అనే పత్రికలో నిజాం నిరంకుశత్వాన్ని ఘాటుగా విమర్శించ సాగాడు. ఇది నిజాం ప్రభువుకూ, ఆయనకు తొత్తులైన రాజకార్లకు ఏమాత్రం గిట్టలేదు.

ఆయన పత్రికా కార్యాలయం నుండి వస్తున్నప్పుడు నిర్దాక్షిణ్యంగా కాచీగూడ చౌరస్తాలో కలం పట్టిన చేతిని నరికి వేశారు. ఇది చాలదంటూ ఆయనను పొడిచివేశారు.

ఈ సంఘటనలే కాదు తెలంగాణా జిల్లాల్లో ఎన్నో చోట్ల జరిగిన దౌర్జన్య పూరిత, హింసాయుత సంఘటనలు విన్నప్పుడు నారాయణరావులో ఆవేశం పొంగి వచ్చేది. ఈ దౌర్జన్య





పూరిత పాలనకు అంతం పాడనిదే లాభం లేదని అనుకునే వాడు. ఇలాంటి భావాలతో అదనుకైవేచి చూడ సాగాడు.

అప్పుడే రిభుదేవ శర్మ అనే సంస్కృత పండితుడు రాసిన ఓ ప్రభావ వంతమైన గీతం ఆయనలో మెదిలింది. ఆయనను లక్ష్యం వైపు ముందుకు సాగేలాచేసింది.

హే ఆర్యవీర్ రణధీర్ తుమ్హారా స్వాగత్
హే ధీర వీర్ గంభీర్ తుమ్హారా స్వాగత్
బమ్‌బర్సేంయా గోలోంకీ లగీ ఝడీ
సిర్ దేనా రఖ్‌నా మాన్ తుమ్హారా స్వాగత్
హే ధీర వీర్ రణధీర్ తుమ్హారా స్వాగత్

ఎన్ని అడ్డంకులు వచ్చినా ధైర్యం చెడకు. లక్ష్యం చేరుకో. ఓ వీరుడా, ధీరుడా ముందుకు సాగు అని ఈ గీతం సారాంశం.

ఈ గీతం నారాయణ రావును పదే పదే దృఢ చిత్తుణ్ణి చేస్తూ వచ్చింది. లక్ష్యం వైపు చేరుకునేలా చేసింది.

చివరి శ్వాస వరకూ నిజాంను గద్దె దింపే ప్రయత్నంలోనే ఉంటాం. మా లక్ష్యం నెరవేరే వరకు ఇక నిద్రపోం అనే ప్రతిజ్ఞ చేసుకొన్నారు.

ఆయనది సడలని మనస్తత్వం- జంకని వీరుడాయన. పోరాటం ఆయన జీవన లక్ష్యం. మిత్రులకు ఎనలేని అభిమాని నారాయణరావు పవార్.

**క్రమంగా ఎదుగుతూ....**

దేశభక్తిని దేహం నిండా పుణికి పుచ్చుకున్న యువకుడు నారాయణరావు పవార్. నిజాం నిరంకుశ పాలనకు విసిగిపోయి నిజాం రాజునే హతమార్చాలనే నిశ్చయానికి వచ్చిన ధీశాలి. స్వేచ్ఛ కోసం తన ప్రాణాన్ని సైతం బలి ఇవ్వడానికిపూనుకున్న సాహస వీరుడు.

వరంగల్‌లోనే జన్మించిన నారాయణరావు పవార్ వరంగల్ పట్టణంలోనే పదవ తరగతి వరకు చదువుకున్నాడు. పదో తరగతి బోర్డు పరీక్ష రాయడానికని ఆయన తొలిసారిగా హైదరాబాద్ వచ్చాడు. అప్పట్లో వరంగల్‌లో పదో తరగతి చదివిన వాళ్లు పరీక్షలకు హైదరాబాద్ రావలసి ఉండేది. ఆ రోజుల్లో హైద్రాబాద్ వెల్లడమంటే ఏ అమెరికాకో, రష్యాకో వెళ్తున్నట్లుగా గొప్పగా చెప్పుకునేవారు. నారాయణ రావు పవార్ హైదరాబాద్‌లోనే పదో తరగతి, ఆ తరువాత ఇంటర్‌మీడియెట్ పరీక్ష కూడా రాశాడు. పరీక్షలురాయడానికి హైద్రాబాద్ వచ్చిన నారాయణరావు పవార్ హైదరాబాద్‌లోనే స్థిరపడిపోయాడు.

నిజాం పాలనలో ఉర్దూ తప్ప మిగిలిన భాషలన్నీ నిరాదరణకు గురయ్యాయి. ఉర్దూ రానివారిని ఎందుకూ పనికి రాని వారుగా ముద్ర వేసేవారు. అందుకే ఈయన ఉర్దూ మీడియంలోనే చదువుకున్నారు. నారాయణరావు పవార్ తండ్రి రైల్వేలో కూలీగా చేసేవారు.

తల్లిదండ్రులు తాను కూలీ పని చేసుకుంటున్నా తన కుమారుణ్ణి బాగా చదివించాలనుకున్నాడు నారాయణరావు తండ్రి.కాని చదివించే స్తోమత లేదు. మెట్రిక్, ఇంటర్ ఎలాగోపూర్తి చేసుకుని లా చదవడానికి హైద్రాబాద్ నగరానికి వచ్చాడు, నారాయణరావు పవార్.

**ఆనాటి హైదరాబాద్ నగర పరిస్థితి :**

అప్పుడు హైదరాబాద్‌లో పరిస్థితి గందరగోళంగా వుంది. మత వివక్ష దారుణంగా ఉండింది. హిందువుల ప్రాణాలకు భద్రత లేదు. మహిళల మాన ప్రాణాలకు రక్షణ లేదు. నగరంలో ఆర్య సమాజం వారు నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతూ తమ ఉద్యమాన్ని కొనసాగించారు. పై చదువు చదవడానికి నగరానికి వచ్చిన నారాయణరావును అప్పటి పరిస్థితులు ఆయనను ఉక్కిరి బిక్కిరి చేశాయి. రజాకార్లు చేస్తున్న దుండగాలు దౌర్జన్యాలు, మానభంగాలు, మహిళల అపహరణలు, బలవంతాన మత మార్పిడి ఆయనను కలచి వేశాయి.

అప్పుడే పవార్ ఆర్యసమాజం పట్ల ఆకర్షితులయ్యారు. అక్కడ జరిగే అన్ని సత్సంగ్ గోష్ఠులకు హాజరయ్యేవారు. హైదరాబాద్‌లో ఆయనకు జగదీష్ ఆర్య, గండయ్య, జి. నారాయణ స్వామి, బాలకిషన్, రెడ్డి పోచాద్ మొదలైన వారితో స్నేహం కలిగింది. వీరంతా ఎంతో సన్నిహితంగా వుండేవారు.

**పండిత నరేంద్రజీతో పరిచయం :**

వీరికి పండిత నరేంద్రజీ ఆదర్శప్రాయులు. వీరు అప్పుడప్పుడూ నరేంద్రజీని కలుసుకొని, హైదరాబాద్ సంస్థానంలో జరుగుతున్న దారుణాలను, దహన కాండలను గూర్చి చర్చించేవారు. వీటిన్నింటికి ప్రధాన కారకుడు నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ అని నిశ్చయించుకున్నారు.

అదే సమయంలో నారాయణరావు పవార్ మిత్రులకు సింగపూర్‌లో నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఇచ్చిన ఉపన్యాసాల సంపుటిని చదివి వినిపించారు. అందులో.

"మీ రక్తం ఇవ్వండి, నేను స్వాతంత్ర్యాన్ని తెస్తాను' అనే కొటేషన్ కనిపించింది.

దాంతో రక్తం కార్చనిదే హైదరాబాద్ విముక్తం కాదని అందుకు నిజామును చంపడానికి నిశ్చయించుకున్నారు.





**ఆత్మత్యాగం మహోత్కృష్టమైనది. :**

త్యాగం ఉత్కృష్టమైనది. అందులో స్వార్థానికి ఆస్కారం లేదు. పరమార్థంతో కూడిన త్యాగాన్ని మించినది ప్రపంచంలో మరేదీ లేదు. అసలు జీవరాశి మనుగడకు, చైతన్యానికి త్యాగామే ఆధారశిల వంటిది. దేశ రక్షణకు గాని, ధర్మరక్షణకు గాని నిస్వార్థమైన ఆత్మ త్యాగమే అవసరం.

దేశ చరిత్ర పుటల్ని ఒకసారి తిరగవేస్తే పరాయిపాలనకు విసిగి వేసారిపోయిన యువ వీరులెందరో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కోసం తమ ప్రాణాలను తృణ ప్రాయంగా ఎంచి బలై పోయిన ఉదాహరణలు కనిపిస్తాయి. దేశానికే ముప్పు వాటిల్లినప్పుడు, దేశీయుల మాన ప్రాణాలు ప్రమాదంలో చిక్కుకున్నప్పుడు ఆత్మత్యాగం వలన ప్రాణాలర్పించడానికి సాహసించిన మహానుభావులే నిజమైన మానవులు, వారే దేశ భక్తులు. వారి త్యాగఫలితంగానే వీరులుద్భవిస్తారు. భౌతికంగా వారు పోయినా వారి పేరు చిరస్థాయిగా నిలుస్తుంది.

భారత ప్రజాస్వామ్య సంగ్రామంలో భగత్‌సింగ్ ప్రాణాలకు తెగించి కౌన్సిల్ హాలులో బాంబు విసిరి పట్టుబడ్డాడు. ఉరికంబమెక్కాడు. గొప్ప దేశ భక్తుడుగా నేటికీ కీర్తింపబడుతున్నాడు.

★☆★

# 14. నిజాంను అంతమొందించడానికి పథకం

హైదరాబాద్‌లో జరుగుతున్న రక్తపాతానికి, హిందువులపై జరిగే అత్యాచారాలకు కారకుడైన రజాకార్ నాయకుడు ఖాసిం రజ్వీని అంతమొందించడమే నా భవిష్యత్ అని నారాయణరావు బృందంలోని మిత్రుడు జగదీష్ ఆర్య పేర్కొన్నాడు. అసలు కారకుడైన నిజాంనే అంతమొందించాలి. ఆర్య చెప్పింది కూడా నిజమే. ఇది మిత్ర బృందానికి నచ్చింది. వారు వెంటనే ఖాసిం రజ్వీని ఎందుకు, ఈ హత్యాకాండకు కారకుడైన ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్‌నే మొట్టమొదలు అంతమొందిస్తే పోలా? అనే పవార్ సలహాను అంగీకరించారు.

నిజాం ప్రతి రోజు సాయంత్రం పూట వెళ్లే బాట మీద ముగ్గురు మూడు చోట్ల నిలబడి నిజాం పయనించే మోటారు కారు రాగానే ఒకరు బాంబు విసరాలి. అది గురి తప్పితే రెండవ వ్యక్తి, ఆ తర్వాత మూడవ వ్యక్తి విసరాలి.

మొత్తానికి ఏ విధంగా నైనా నిజాం బతికి బయట పడకుండా చూడాలి. ఇందుకు నారాయణరావు, గండయ్య, జగదీశ్వర్‌లు నియుక్తులయ్యారు. గాలయ్య నుండి నారాయణ రావు బాంబు తీసుకొన్నాడు. ఇంకా కొన్ని తెచ్చుకోవాలనే ఉద్దేశంతోనే నారాయణరావు, జగదశ్వర్, విశ్వనాథ్‌లు షోలాపూర్ వెళ్లారు.

ఈ ముగ్గురు వట్టి చేతులతో అంటే బాంబులు తీసుకు రాకుండా హైదరాబాద్ చేరుకున్నారు. ఎందుకంటే శనివారం కల్లా కొండాలక్ష్మణ్, టి. లక్ష్మణ్ ద్వారా హైదరాబాద్‌లో బాంబులను అందజేస్తున్నట్లు హామీ ఇచ్చారు.

హైదరాబాద్ వచ్చిన నారాయణరావు పవార్ పథకం ప్రకారం శని, ఆదివారాలు ఎదురుచూసి సోమవారం నాడు తిరిగి నారాయణ స్వామితో షోలాపూర్ వెళ్లాడు. అయితే తాను ఇది వరకే టి. లక్ష్మణ్ ద్వారా బాంబులను నగరానికి పంపించినట్లు అక్కడ వారు తెలిపారు.

అప్పుడు వీరిద్దరి మధ్య ఒక ఒప్పందం జరిగింది. కొండా లక్ష్మణ్ బసవ రాజు, నారాయణరావు, నారాయణ స్వామిల మధ్య ఒక నిర్ణయం తీసుకోబడింది. పోలీసులకు చిక్కితే రహస్యాలు బయటపడతాయి కాబట్టి, పట్టుబడే పరిస్థితే వస్తే వెంట ఉన్న విషం సేవించాలనే తీర్మానం జరిగింది వారి మధ్య. కాగా టి. లక్ష్మణ్ తమకు కనబడ వచ్చును లేదా కనబడక పోవచ్చును. అందువల్ల రెండు బాంబులు అదనంగా ఇవ్వ వలసిందని





వారు కోరారు. అలాగే వారు రెండు బాంబులను అదనంగా ఇచ్చారు. అవి తీసుకొని నారాయణరావు, నారాయణస్వామి హైదరాబాద్‌కు తిరుగు ప్రయాణం పట్టారు.

**శంకరరావు ఇంట్లో జరిగిన పని :**

ఆ రోజున శంకరరావు ఇంట్లో నారాయణరావు విషాన్ని మూడు చిన్న సీసాలలో నింపి ఇద్దరు సహచరులకు ఒక్కొక్కటి చొప్పున యిచ్చి ఒకటి తన దగ్గర పెట్టుకొన్నాడు. అక్కడి నుండి సుల్తాన్ బజార్‌లోని సత్యనారాయణ సైకిల్‌షాప్‌కి వెళ్లారు. ఆ తరువాత దేవనాథ్ ఫోటో స్టూడియోకి వెళ్లారు. గండయ్య, నారాయణరావు, ఈశ్వరయ్య గ్రూపు ఫోటోలు తీయించుకున్నారు.

గండయ్య, నారాయణరావు, ఈశ్వరయ్య ముగ్గురు హెడా దుకాణంలో సైకిళ్లు కిరాయకు తీసుకొని గాలయ్య ఇంట్లో పెట్టి కాలినడకన కింగ్ కోఠీకి చేరుకున్నారు. స్కూలు (మెథడిస్ట్) సందు మలుపులో నారాయణరావు తానుంటానని నిర్ణయించుకున్నాడు. బొగ్గుల కుంట సందు మొదట్లో ఈశ్వరయ్య ఉండాలనీ, గండయ్య మెథడిస్టు స్కూలు గేటు ముందు ఉండాలని నిర్ణయించుకొన్నారు.

సాయంత్రం గం॥4-15 ని॥లకు నిజాం సవారి బయలుదేరే సంరంభం మొదలైంది.

**పథకం తీరు :**

ఈ కార్యక్రమంలో జగదీష్ ఆర్యాను, గండయ్యను, నారాయణరావు పవార్‌కు సహచరులుగా ఎంపిక చేశారు. అలా వారి ఆదేశం ప్రకారం షోలా పూర్ నుండి హైదరాబాద్‌కు వచ్చి 4-12-1947న నిజాంపై బాంబు వేయడానికి ఉపక్రమించారు. ఆ రోజు మధ్యాహ్నం 3 గంటల నుండే కింగ్ కోఠీ మార్గంలోని ఆయా కూడలి స్థలాల్లో నారాయణరావు పవార్, జగదీష్ ఆర్య, గండయ్య గారలు వేరు వేరుగా నిజాం రాక కొరకై శక్తివంతమైన బాంబులతో, గ్రేనేడ్‌లతో వేచి ఉన్నారు. కింగ్ కోఠీ మార్గాన ఆల్ సెయింట్స్ స్కూల్ మీదుగా విదేశీకారులో పయనించే మీర్ ఉస్మాన్ అలీఖాన్‌పై బాంబును ప్రయోగించవలసి వుంది.

**నిజాం బయలు దేరుతున్నాడంటే అంతా నిశబ్ద వాతావరణం ఏర్పడాల్సిందే!**

మక్కా మసీదులోని తల్లి సమాధికి నమస్కరించి తిరిగి ఇంటికి వచ్చే ఆచారంగా పెట్టుకున్నాడు నిజాం.

నిజాం ఇంటి నుండి బయలు దేరగానే విజిల్స్ మోగుతాయి. రోడ్ల మీద ఉన్న జనం, నడిచే వారు, వాహనాలపై వెళ్లేవారు ఎక్కడివారు అక్కడే పక్కకు తొలగి పోవాల్సిందే. సైకిళ్లు, కార్లు మెయిన్ రోడ్డును వదిలి ఆయా ప్రాంతాల్లో గల్లీల్లోకి వెళ్లాల్సిందే.

ఆ రోజు అంటే 1947 డిసెంబర్ 4న జరిగిందేమిటంటే "తాడ్‌బన్ మేలా" ఉండింది. నిజాం సవారీ అరగంట ముందే అంటే 4.30 గం॥లకే బయలు దేరింది. విజిల్లు మారు మోగసాగాయి. రోడ్లన్నీ ఇంచుమించు ఖాళీ అయ్యాయి. అంతా నిశ్శబ్దం నెలకొంది. నిజాం నిరంకుశ నరకాసురుడు కింగ్ కోఠీ నుండి 5 గంటలకు బయలుదేరాడు. ఆల్‌సెయింట్ స్కూలు గల్లీ మలుపు వద్ద నారాయణరావు పవార్ కానిస్టేబుల్ వెనకాలే ఉన్నాడు. కానిస్టేబుల్ షేక్ హుసేన్ ప్రక్క నుండే మెల్లగా జారుకుని నిజాం కారు అలారాగా నే నారాయణరావు పవార్ బాంబును విసిరాడు. కాని దురదృష్ట వశాత్తు బాంబుకారులో పడలేదు. కారు డోర్‌కు తాకి రోడ్డుపైన పడింది. అయితే ఆ బాంబు మోటారు చక్రాలకు నెట్టుకుంటూ వచ్చి అకస్మాత్తుగా పేలిపోయింది. ఒక్కసారే సృష్టి మునిగేంతటి శబ్దం వచ్చింది. పడ్డ చోట దట్టమైన పొగ వ్యాపించింది. అంతా భయానక తావావరణం నెలకొంది. పక్కనున్న గోడలు పగుళ్లు బట్టాయి. బాంబు (లోహం) ముక్కలు నాలుగు వైపులా వ్యాపించాయి. పేలిన చోట పెద్ద గుంట ఏర్పడింది. ప్రక్కనే ఉన్న ఇద్దరు వ్యక్తులకూ, ఒక అమ్మాయికీ గాయాలయ్యాయి. డ్రైవర్ షేక్ మహబూబ్ బాంబు పేలగానే అగమ్య గోచరంగా కారును స్పీడ్‌గా వెనక్కి పోనిచ్చాడు.

కానిస్టేబుల్ షేక్‌హుసేన్ "వెంటనే" పట్టుకోండి, పట్టుకోండి" అంటూ అరిచాడు. పోలీసులు వచ్చి నారాయణ రావును పట్టుకొన్నారు. నారాయణ రావును ఇష్టం వచ్చినట్లు కొట్టడం మొదలు పెట్టారు.

మరో బాంబు తీయడానికి కోటు కుడి జేబులో నారాయణరావు చేయి పెట్టబోయాడు. ఇంతలోనే షేక్‌హుసేన్ నారాయణరావును పట్టుకొన్నాడు. ఈ లోపలే ఒక అరబ్బు నారాయణరావును పొడవడానికి బల్లాన్ని తీశాడు. కాని ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్ జోసెఫ్ ఆయనను తోసివేశాడు. ఈ ప్రయత్నంలో జోసెఫ్ వేళ్లకు గాయాలయ్యాయి.

ఈయనను వదిలిపెట్టరు. ఎలాగూ చంపేస్తారనడంతో అరబ్బు తృప్తి పడ్డాడు.

అప్పుడు నారాయణరావును కొడుతూనే కింగ్ కోఠీవైపుకు తీసుకువెళ్లారు. అయినా నారాయణరావు ఏమీ మాట్లాడలేదు. తన పేరు "బాబూ" అని మొదటి నుండి చెబుతూ వచ్చాడు.

★☆★





# 15. జాతీయ భావాల ప్రజా ఉద్యమం

ముస్లింలందరు మత దురహంకారులని అనుకోరాదు. ముస్లింలలో న్యాయ వర్తనులు, మత సహిష్ణుత గల వారు, రుజువర్తనులు కూడా ఉన్నారు. మతాభిమానానికి అతీతుదైడన వారు కూడా వున్నారు.

అయితే విద్యావంతులైన ముస్లిం లెందరో మజ్లిస్ వారి దౌర్జన్యానికి బెదరి వారి వైపు మాట్లాడే వారు. కానీ మనస్ఫూర్తిగా మజ్లిస్ పద్ధతులను ఒప్పుకునే వారు కాదు. అలా సమదృష్టిగల ముస్లింలకు హిందువుల పట్లద్వేష భావం లేక పోయేది.

రజాకార్లు ప్రజలపై జరిపే దురాగతాలు తారా స్థాయికి చేరిన రోజులలో కూడా హైదరాబాద్‌లో న్యా యదృష్టి గల ముస్లింలు లేకపోలేదు. ఇత్తెహదుల్ ముసల్మీన్ సంస్థ విధానాలు మంచివి కావనీ, రజాకార్లు చేస్తున్న దుండగాలు దేశానికీ అనర్థదాయకమనీ భావించే ముస్లింల సంఖ్య కొంత మాత్రమే ఉండేది దాన్ని బయట వ్యక్తం చేయ్యడానికి భయపడేవారు.

ఇండియన్ యూనియన్‌లో సత్సంబంధాలు ఏర్పరచుకోవటం వలన ప్రజల విశ్వాసాన్ని చూరగొనేటటువంటి బాధ్యత కలిగి తాను చేసిన చర్యలకు జవాబుదారీ కాగల శక్తి కలిగి నటువంటి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం వలన మాత్రమే బయటి చేష్టలుగాని, అంతరంగిక ఆక్రమలుగాని అరికట్టడానికి వీలవుతుంది. భారత దేశంలో చేరడం బానిసత్వముగానీ, లొంగిపోవడం అని గానీ ప్రజలకు చెప్పడం సరికాదు.

ఆనాడు 1948 ఆగస్టు 19న ప్రధాన మంత్రి జవహర్లాల్ నెహ్రూ న్యూఢిల్లీలో ఉపన్యసిస్తూ ఇలా అన్నారు.

"హైదరాబాద్ భారత దేశంలో కలిసి పోవటం అంటే దాసోహం అనటం కాదు. దేశంలోని ప్రతి వ్యక్తి స్వతంత్రుడవటమే చేరి పోవటానికి లేక విలీనం కావటానికి అర్థం సమానత"

ముస్లింలకు ప్రాతినిధ్యం వహించే మజ్లిస్‌లోనే. ఇండియన్ యూనియన్‌లో హైదరాబాదు చేరాలనే వర్గమొకట్టుది. అది లేకపోతే యదాతథపు ఒడంబడిక జరిగేది కాదు. హైదరాబాదు తప్పనిసరిగా ఇండియన్ యూనియన్‌లో చేరాలనీ, ఈ విషయంలో భారతదేశంతో సహకరించాలనీ విద్యావంతులూ, ఔచిత్యం తెలిసిన ముస్లింలూ అనేకులూ భావించారు,

కానీ అప్పటి ప్రభుత్వ మతపాక్షిక దోరణి వల్ల ఆసంబంధాలు చెడిపోయాయి. రజాకార్ల దౌర్జన్యాలను గుర్తి హిందూ ప్రజల ఆర్తనాదాలు నివిపిం కోక ప్రభుత్వం తమపక్షపాత విధానాన్ని రుజువు పరచుకొన్నారు.

నిజాం ఇలాంటి ద్వంద్వ నీతికి పాల్పడుతున్నందుననే నారాయణరావు పవార్ ఆయన అనుచరులు నిజాంను హతమార్చడమై సరియైన మార్గమని అభిప్రాయ పడ్డారు. వారు షోలాపూర్ వెళ్లి క్యాంప్ ఇన్చార్జి కొండాలక్ష్మణ్ బాపూజీను కలుసుకున్నారు. వారితో చర్చించారు.

అప్పుడు కొండాలక్ష్మణ్ వారికి సహకారం అందించడానికి ఒప్పుకున్నారు. షోలాపూర్‌లో హైదరాబాద్‌కు చెందిన వారి కారు అద్దెకు తీసుకున్నారు. బంతిలో రాళ్లువేసి కట్టి బాంబు సైజులో ఉండే విధంగా తయారు చేసి పరుగెత్తుతున్న కారులో పడేటట్లు ప్రాక్టీసు చేశారు.

1947 డిసెంబర్ 4న సాయంకాలం నిజాం పాతబస్తీకి కారులో వెళ్లే సమయంలో బాంబు వేయాలని కార్యక్రమం రూపొందించుకున్నారు.

★☆★





# 16. నరకాన్ని చవి చూసిన నారాయణ రావు పవార్

అప్పుడు నారాయణరావును ఎన్ని చిత్రహింసలు పెడుతూ పోయారో దేవుడికే తెలియాలి. ఇష్టమొచ్చినట్లు కొట్టారు. వినరాని విధమైన మోటుకూతలు కూశారు. మీద ఉమ్మివేశారు.

ఈ దెబ్బలకు ఆయన ఒళ్లంతా హూణమై పోయింది. ఆయనను కింగ్ కోఠీ పోలీస్ స్టేషన్‌కు తీసుకు వెళ్లారు. దెబ్బలతో హూణమైపోయిన ఆయన ఎంతో బాధపడుతున్నాడు. దప్పివేసింది. నీళ్లు! నీళ్లు! అని అడిగాడు.

అప్పుడు జరిగిందో ఘోరమైన, హృదయ విదారకమైన సంఘటన-గ్లాసులో నీళ్లు ఇచ్చే బదులు అక్కడి పోలీసులు ఆయన నోట్లో మూత్రం చెయ్యడానికి సిద్ధపడ్డారు. సరిగా అదే సమయానికి నిజాం ప్రధాన మంత్రి లాయక్ అలీ అక్కడికి విచ్చేశాడు.

తనిలా ప్రశ్నించాడు.

"ఈ సంఘటన వెనక ఇంకా ఎవరెవరున్నారు?

నేనొక్కణ్ణి మాత్రమే ఉన్నాను. ఇంకా ఎవరూ లేరు అని జవాబిచ్చాడు నారాయణరావు. ఆయనతో కూడా తన పేరు బాబూ అని చెప్పాడు.

అతనితో మాట్లాడడానికే శక్తి లేకుండా పోయింది. బాధ మరో వంక - దాహం మరో వంక - నాకు నీళ్లివ్వండి అంటూ సైగ చేశాడు నారాయణరావు.

లాయర్ అలీ నీళ్లివ్వమని కానిస్టేబుళ్లకు సైగచేశాడు.

గ్లాస్‌ను నోట్లో పెట్టుకొని రెండు చుక్కలు తాగాడో లేదో గ్లాసును లాగేసుకున్నాడు.

నిజాం ప్రభువు పిలుస్తున్నాడని లాయక్ అలీ వెళ్లిపోయాడు.

ఇక అప్పుడే అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ పోలీస్, ఫజల్ రసూల్‌ఖాన్, రిజర్వ్ పోలీసుదళంతో అక్కడికి చేరుకున్నాడు. జీపులో కూర్చోబెట్టుకొని నారాయణరావును పోలీస్ కమీషనర్ కార్యాలయానికి తీసుకు వెళ్లారు.

జీప్‌లో తీసుకు వెళ్తూ ఆయనను ఎన్నో విధాలా ప్రశ్నించారు. భగత్‌సింగ్ లాగా నీవూ గొప్ప దేశ భక్తుడివి బయలు దేరావు.

సర్దార్ వల్లభ భాయి పటేల్ ఆదేశాల మేరకే ఇలా చేశావా? అని ప్రశ్నించసాగారు. ఆయనను పొగడినట్లే పొగడి రహస్యాలను లాగాలనుకున్నారు.

కాని నారాయణరావు మాత్రం దృఢ చిత్తంతో ధైర్యంగా నేనొక్కడినే ఈ చర్యకు పూనుకున్నానన్నాడు. దేశద్రోహులంటే నాకు పరమ అసహ్యం అన్నాడు. అమాయకులను

అకారణంగా హింసించడం, అమాయకులపై రాచరికపు హుందాను చూపి హింసించడం, హతమార్చడం నాకిష్టం లేదు.

భగత్‌సింగ్ గురించి మాట్లాడుతున్నారా!

"కృషీ వలురైన భారతీయ ప్రజానీకాన్ని వారి సహజ వనరులను కొన్ని పరాన్న జీవులు భక్షిస్తున్నంత కాలం యుద్ధ పరిస్థితి కొనసాగుతుంది. వారు బ్రిటిష్ పెట్టుబడిదారులు కావచ్చు, అచ్చంగా భారతీయులే కావచ్చు. బ్రిటిష్-ఇండియన్ యంత్రాంగం ద్వారా లేదా భారతీయ అధికార వ్యవస్థ ద్వారా వారు తమ స్వార్ధ ప్రయోజనాలు సాధిస్తూ ఉండవచ్చు ఏదైనా తేడాలేదు.

ఇక మాగతి ఏమవుతుంది అనే విషయం - మీరెలాగూ మాకు మరణ శాసనం రాశారు. అలాగే కానీయండి. మీ చెతుల్లో అధికారం ఉంది. అధికారాన్ని మించి ప్రపంచంలో ఇంకేముంది. కర్ర ఉన్న వాడిదే బర్రె-ఇదే మీ సిద్ధాంతం అని మాకు తెలుసు" అంటూ ఆనాడు భగత్ సింగ్ ప్రవచించిన వాక్యాలను నారాయణరావు గుర్తు చేశారు.

దీంతో పోలీసులు హడలెత్తి పోయారు. ఆనాడు భగత్‌సింగ్ పట్టుబడి కోర్టులో ఉన్నది ఉన్నట్లు చెప్పాడు - నీవూ అలాగే చెబుతావా? అని ప్రశ్నించారు.

వారు ఏమంటున్నా నారాయణరావు మాత్రం తొణక లేదు. బెదరలేదు.

నేనొక్కడినే ఈ చర్యకు పూనుకున్నాను. దీని వెనక ఇంకెవరూ లేరని ఖచ్చితంగా చెప్పాడు.

ఈ మాటలు అంటూండగానే నారాయణరావును పోలీసులు లాఠీలతో బాదసాగారు. రెండు చేతులనూ పైకెత్తి రూలు కర్రతో మోకాళ్లపై మో చేతులపై ఇష్టమొచ్చినట్లు కొట్టారు. మోచేతులు, కాళ్లపై చర్మం పైకి వచ్చింది. రక్తం కారసాగింది.

★☆★





# 17,ఆనాటి మరచిపోలేని సంఘటనలు

నారాయణరావు పవార్ పట్టుబడ్డాడనే వార్త రేడియో ప్రసారం చేసింది. బాంబు పేలుడు విజయవంతం కాలేదని మనస్సులో బాధపడుతూ నారాయణస్వామి లోలోపల బాధపడుతూ బొల్లారం కంటోన్మెంట్‌లో ఉన్న ఆయన ఇంటికి బయలు దేరాడు. ఇంతలో కవాడీగూడలో ఉండే ఆయన మిత్రుడు లక్ష్మీ నారాయణ అక్కడికి చేరుకొన్నాడు. నారాయణ స్వామిని వెంటనే ఆ ప్రాంతం వదిలి వెళ్లిపొమ్మని కోరాడు.

అప్పుడే రేడియోలో ప్రాంతీయ వార్తలు వస్తున్నాయి. వార్తల్లో నిజాంపై బాంబుదాడిని ప్రస్తావించారు. అందుకే నారాయణ స్వామిని నిజాం సంస్థానం నుండి బయటికి వెళ్లిపోవలసిందిగా కోరారు. అదే రోజు నారాయణస్వామి బొల్లారంలోని తన గదిని వదిలి సికంద్రాబాద్ రైల్వేస్టేషన్ చేరుకున్నాడు.

అదే రోజు రాత్రి బొల్లారంలోని నారాయణస్వామి గదిని పోలీసులు సోదా చేశారు. గదిలోని పుస్తకాలను, కాగితాలను అన్నింటినీ తీసుకు వెళ్లారు. నారాయణ స్వామి కనుక వెంటనే గదిని ఖాళీ చేసి వెళ్లక పోతే ఆయన అరెస్టయ్యే వాడే. అలా డిసెంబర్ 4న నారాయణ స్వామి సికింద్రాబాదు నుండి బయలు దేరి విజయవాడ చేరుకున్నాడు. అక్కడ అంటే సికింద్రాబాద్‌లో నారాయణస్వామి లాలాగూడలో కోహేడ్‌లో పనిచేసే నాగభూషణం అనే మిత్రుడు కలుసుకున్నాడు.

ఇప్పుడు నీవెక్కడికి వెళ్తున్నావని అడిగాడు నాగభూషణం మిత్రుడు. నారాయణస్వామిని, "గమ్యం అగమ్య గోచరం" అని జవాబిచ్చాడు నారాయణస్వామి.

అప్పుడు నారాయణ స్వామి వద్ద నాలుగు అణాల హాలీసిక్కా "చార్‌అణా" ఉండింది. నాగభూషణం గుంటూరు జిల్లాలోని నిడుబ్రోలు గ్రామంలో తన మామ ఉంటాడనీ, నీవు అక్కడికెళ్లి ఉండవచ్చుననీ సలహా యిచ్చాడు. కొద్ది రోజుల వరకు నారాయణ స్వామి నిడుబ్రోలు లోనే ఉన్నాడు. తరువాత రుద్రదేవ్ సలహా మేరకు విజయవాడ క్యాంపు చేరుకున్నాడు.విజయవాడ క్యాంపులో అప్పుడు హయగ్రీవాచారి, బొమ్మకంటి సత్యనారాయణగారలు పనిచేస్తున్నారు.

నారాయణస్వామి ఉద్యమంలో పాల్గొనడానికి ఉద్యమించాడు. ఖాజీ పేట దర్గా గ్రామంలో నారాయణస్వామి తల్లి భార్య ఉండేవారు. అక్కడ పోలీసులు వారిని హింసించ సాగారు.

**లాకప్‌లో పవార్ కష్టాలు :**

పోలీస్ కమీషనర్ కార్యాలయం లాకప్‌లో నారాయణరావు పవార్‌ను 1947 డిసెంబర్ 4న బంధించారు. ఆయన లాకప్‌కు దగ్గరే ముందు సుమారు 25 అడుగుల దూరంలో మరో లాకప్ ఉండింది. లాకప్‌కు లావైన ఇనుప రాడ్‌లు ఉండేవి. ఆయన లాకప్ ముందే ఒక గొంగళి పరచి ఉండేది. డిసెంబర్ 7న ఉదయం 7 గంటల సమయంలో గొంగళి కింద పరచబడి ఉంది. ముందున్న లాకప్‌లో పవార్ మిత్రుడు గంగారాం కూర్చొని వున్నాడు. అలా గంగారాం కూడా పట్టుబడ్డట్టు నారాయణరావ్ పవార్‌కు తెలిసింది.

ఇంకా నీ వెంట ఉన్నారు కుట్రదారులు అని లాకప్‌లో ఉన్న పవార్‌ను అడుగుతూ పోయారు పోలీసులు. ఎంత వేధించినా, బాధించినా, హింసించినా ఎవరూ లేరని చెప్పాడు నాయణరావు పవార్. కానీ ఇప్పుడు గంగారం కనబడగానే ఆయన పై జరిగిన దౌర్జన్యం, హింస హృదాయే అయిపోయినట్లు భావించాడు పవార్.

కిరాయకు తీసుకున్న సైకిల్ హ్యాండిల్‌పై "ఎస్.కె.10" నెంబర్ లోతుగా ఎంగ్రేవ్ చేయబడింది. వారు ఎంత ప్రయత్నించినా అది చెదిరిపోలేదు. ఆ నంబర్ ప్రభావమే వీరి అరెస్టు అని నారాయణ రావు అనుకొన్నాడు.

ఈ కేసులో 12 మంది ముద్దాయిలను పోలీసులు నమోదు చేసుకొన్నారు. కానీ హైదరాబాద్ బేగం బజార్‌కు చెందిన లక్ష్మణ్‌రావు కల్చర్‌కర్, హైదరాబాద్ గౌలీగూడకు చెందిన మాధవరావు కుమారుడు విఠల్‌రావు, హైదరాబాద్ చిక్కడపల్లికి చెందిన బాపూరావులకు ఈ కేసుతో ఎలాంటి సంబంధం లేదు. వీరిలో విఠల్‌రావు చేత కూపీ లాగడానికి అనవసరంగా దోషీగా చేర్చారు. మిగిలిన 9 గురిలో నారాయణరావు పవార్, గంగారామ్ ఇద్దరు మాత్రమే పట్టుబడ్డారు. మిగిలిన 7గురు ఈశ్వరయ్య(జగదీష్), బాల్‌కిషన్, జి. నారాయణస్వామి, విశ్వనాథ్(గాలయ్య), రెడ్డి పోచనాథం, కొండా లక్ష్మణ్ బాపూజీ (వకీల్), భీష్మదేవ్‌లు చివరి వరకూ పట్టుబడలేదు.

★☆★





# 18. చరిత్రాత్మకమైన అభియోగం

## జైలు నుండి విడుదల :

నారాయణరావునూ, గంగారాంనూ మెజిస్ట్రేట్ (మిలిటరీ సంబంధమైన) ఎదుట హాజరు పరచారు. పవార్, గంగారాం ఇద్దరూ తమపై మోపబడ్డ అభియోగాన్ని అంగీకరించారు. దేశ పరిస్థితి దృష్ట్యా, ఇక్కడ ప్రజల మాన, ప్రాణాలను దృష్టిలో పెట్టుకొనే మేమీ చర్యకు పూనుకున్నామని (బాంబుకేసు విషయంలో) ఒప్పుకున్నారు.

నిజాంపై బాంబు విసిరిన సంఘటన నిజామాబాద్ జైల్లో ఉన్న మహాకవి దాశరథి గారికి తెలిసిపోయింది. దీంతో ఆ కవి ఉప్పొంగిపోయి ఇలా అన్నాడు.

"బాంబు ఒక రవి గోళం అయితే నిజాం ఒక నరకాసురుడు"

నారాయణరావ్ మేజెస్ట్రేట్ ముందు యిచ్చిన వాంగ్మూలం మరచి పోరానిది.

"నిజాం భారత దేశానికే ఒక దేశ ద్రోహి. ఈ దేశ ప్రజలలో కలసి మెలసి ఉంటూనే ఆసఫియా, ఇస్లాంను ఇక్కడ గట్టిగా, చెదరని విధంగా ప్రతిష్ఠించడానికి కరాచీ, లండన్‌లతో సంబంధాలు నెరపు తున్నాడు. ఈ దేశం గాలిని పీల్చుకుంటూ ఈ దేశానికే తీరని ద్రోహం తలపెడుతున్నాడు. హైదరాబాద్ సంస్థాన ప్రజలకు స్వేచ్ఛ కల్పించి, ప్రజాస్వామ్య విధంగా ఇక్కడ పరిపాలనను కొనసాగించడానికి కాదు పొమ్మంటున్నాడు. ఇక్కడి హిందువలపై దౌర్జన్యాలు జరిపి ఇక్కడి హిందువులను ఇస్లాం మతంలో కలుపుకోడానికి క్రూర కృత్యాలకు పాల్పడుతున్నాడు. 12 లక్షల మంది గుండాలను బయటి నుంచి రప్పించి హైదరబాద్‌లో దింపాడు. అలా వచ్చిన వారంతా ఇక్కడి వారిని నరకయాతన పెడుతున్నారు. ఈ హైదరాబాద్ రాష్ట్రాన్ని విడిచివెళ్లి పొండి అని బలవంతం చేస్తున్నాడు. ఇక్కడి హిందువుల ఇళ్లను దోచేస్తున్నారు. ఇక్కడి స్త్రీల మానాలకు భద్రత లేకుండా పోయింది. వీటన్నింటికీ మూల కారకుడు ఈ నిజామే! అందువల్లనే ఈ కరుడు గట్టిన శనీశ్వరుడిని హతమార్చాలని 1947 డిసెంబర్ 4న నిజాంపై బాంబును విసిరాను".

ఏ కారణం చేతనైనా నీవు పట్టుబడితే నీవేం చెబుతావని కొండాలక్ష్మణ్ బాపూజీ ఈ సంఘటనకు ముందే అడిగాడు. అప్పుడు పై అంశాన్నంతా కాగితం మీద రాసి ఆయనకు చూపించాడు. ఈ వాంగ్మూలం చాలా బాగుంది. ఎప్పుడడిగినా నీవు ఈ విషయాన్నే చెబుతూపో"

అని ధైర్యాన్ని కలిగించారు కొండాలక్ష్మణ్ బాపూజీ.

నారాయణరావు, గంగారాం తరపున నియుక్తులైన సెషన్ కోర్టు అడ్వొకేటు ముర్తుజా అలీఖాన్‌ను నియమించారు. ప్రభుత్వం తరపున రాంలాల్ కిషన్‌ను నియమించారు.

రైతుల నుండి బలవంతంగా లెవీ దాన్యాన్ని లాగేసుకుంటున్నందున ఈ విషయాన్ని నిజాంకు తెలియజెయ్యడానికి, ఆయన కారును ఆపడానికే బాంబును విసిరానని చెప్పమనీ, నిజాంను హతమార్చడం నా ఉద్దేశం కాదనే వాంగ్మూలాన్ని ఇవ్వమనీ, అలా యిస్తే మరణ శిక్ష నుండి బయట పడతావనీ అడ్వకేట్ నారాయణరావు పవార్‌కు సలహా ఇచ్చారు.

దేశభక్తి గల పౌరుణ్ణి. నాకు నా దేశం ముఖ్యం. నేను నా వాంగ్మూలాన్ని మార్చి దేశ ద్రోహానికి పూనుకోనని నారాయణరావు ఖచ్చితంగా చెప్పేశారు. దీంతో కోర్టు నారాయణ రావుకు ఉరి శిక్ష విధించింది.

జీవితం మీద ఆశవదులుకొని, దేశ మాత చరణాలను, చిత్త శుద్ధితో నమస్కరించి జనకంటకుడైన నిజాం మీద బాంబు వేసి దేశాన్ని విముక్తం చెయ్యడానికి ఉపక్రమించాడు.

దురదృష్టవశాత్తు వెంట్రుక వాసిలో బాంబు గురి తప్పింది. నిజాం బతికి బయట పడ్డాడు.

నారాయణరావు పిరికి వానిలా పారిపోలేదు. వీరునిలా తలపైకి ఎత్తి తాను చేసిన కార్యాన్ని ఒప్పుకొన్నాడు.

పోలీసుల కంట పడగానే, రజాకార్లు అతన్ని తునా తునకలుగా నరకాల్సిందే. కాని నిజాం మాటపై వారు అలా చేయలేదు. కాని దైవికంగా బతికి పోయాడు. ఆయన బతికి బట్ట కడతాడనీ, నేడు మన మధ్య ఉంటాడనీ ఎవరూ ఊహించలేదు. ఆశించలేదు. అతనికి పడ్డ ఉరి శిక్ష అమలై వుంటే, ఉరి తీయబడి ఉంటే నేడు ఆయన దేశ భక్తికి చెందిన వాడుగా ప్రస్తుతింపబడేవాడు.

ఇలా హైదరాబాద్ స్వాతంత్ర్య చరిత్ర మన దేశ చరిత్రలో నిరుపమానమైనది.

నిందితులు తమ వాంగ్మూలంలో తాము నిజాం ప్రభుత్వంతో పోరాటం జరపాలని ఎన్నడో నిశ్చయించుకున్నామని 15 ఆగస్టు 1947 నుండి తమ ప్రయత్నాలు, ధృఢం చేశామని





చెప్పారు.

అయితే పోలీసు చర్య తర్వాత, ఉరిశిక్ష అమలు జరుగలేదు. దైవికంగా ప్రాణం దక్కింది. సైనిక గవర్నర్‌గారు ఉరి శిక్షను ఆజన్మ కారాగార వాసంగా మార్చాడు. జైలులో ఉంచారు.

మహా ఘనత వహించిన నిజాంపై భాంబు వేసిన వీరున్ని ఇంకా జైలులో ఉంచటం తగదని ప్రజలు సభలు, సమావేశాలు జరిపారు.

ఒక సభలో భాయీ రామ్మూర్తి నాయుడు ఆవేశంతో మాట్లాడుతూ, నారాయణ రావు అంతటి మహావీరుణ్ణి ఇంకా జైలులో ఉంచటం విచారకరమని ఆవేదన వ్యక్తం చేశారు.

స్వామి రామానంద తీర్థ గారు కలుగ జేసుకొనగా "మాఫీనామా" అంటే తప్పైందని ఒప్పుకుంటే విడిచి పెట్టడానికి సైనిక గవర్నరు ఒప్పుకున్నారు.

కానీ అందుకు ఎవరూ అంగీకరించలేదు.

నారాయణరావు పవారైతే ఇలా స్పందించాడు.

దయ! భిక్ష! క్షమాపణ వేడుకోవడం! అదీ కరుడు గట్టిన ఒక నిరంకుశ, కౄరుడితోనా! నేను నా ప్రాణాన్నైనా వదులు కుంటాను కాని అందుకు ఒప్పుకోను" అంటూ నారాయణ రావు పవార్ గర్జించాడు.

సర్దార్ వల్లభ భాయిపటేల్ హైదరాబాదుకు వచ్చిన సందర్భం అది. మేల్కోటే నివాసంలో జరిగిన కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం అది. ఈ సమావేశంలో పాల్గొనడానికి నారాయణ స్వామి, స్వామి రామానంద తీర్థగారితో మాట్లాడి రెండు పాస్‌లను సంపాదించాడు. ఒకటి ఆయనకు, మరొకటి నారాయణ రావు పవార్ తండ్రి పండరీనాథ్ రావ్ పవార్‌కు.

అక్కడ జరిగిన సమావేశంలో పాల్గొన్న పండరీనాథ్ రావు పవార్ "మీరు స్వతంత్రులై స్వేచ్ఛా గాలులను పీలుస్తూ ప్రభుత్వాన్ని నడుపుతున్నారు. కాని నా కుమారుడు, ఆయన స్నేహితుడూ జైలులో నరక యాతనను అనుభవిస్తున్నారు. ఇది ఎంత మేరకు సమంజసం!"

అలా ఈ సమస్య సర్దార్ పటేల్ దృష్టికి వచ్చింది. వీరి విడుదలసమస్య

జఠిలమైంది.

పరిస్థితులు అనుకూలించాయి.

1949 ఆగస్టు 10నచంచల్‌గూడ జైలు గేటు ముందుకి నారాయణరావునూ, గంగారాంనూ తీసుకువచ్చారు. బేషరతుగా వారినివదిలివేశారు.

ఆ సమయంలో వారు తమ ఇళ్లు చేరికోడానికి కూడా వారి వద్ద డబ్బు లేదు. సరియైన బట్టలులేవు.

అప్పుడు నారాయణరావు తన మిత్రుడు నారాయణ స్వామికి ఫోన్ చేసి బట్టలు తెప్పించుకున్నాడు తనకూ, గంగారాంకూ. కాంగ్రెస్ కార్యకర్తలు జీపులో చెంచల్ గూడ జైలుకు చేరుకున్నారు.

ఇద్దరూ గుడ్డలు మార్చుకున్నారు.

ఇద్దరికీ పూలమాలలు వేశారు. ఘనంగాస్వాగతం చెబుతూ ఊరేగింపుగా తీసుకు వెళ్లారు.

అప్పుడు అక్కడకు విలేకరులు కూడా చేరుకున్నారు.

హిందూ ఆంగ్ల పత్రిక రిపోర్టర్ వామన్‌రావు గారు అక్కడికి చేరుకున్నారు. ఆ తరువాత ఆయన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వసమాచార పౌరశాఖకు డైరెక్టర్‌గా పని చేశారు.

వీరి విడుదల వార్త అన్ని పత్రికల్లో వచ్చాయి. ఆకాశవాణి ఈ విషయాన్ని ప్రసారం చేసింది.

పోలీస్ ఆక్షన్ తరువాత పెద్ద ఎత్తులో రజాకార్లను నిర్బంధించ సాగారు. ప్రభుత్వగణాంకాల ప్రకారం 15,654 మంది రజాకార్లను నిర్బంధంలోకి తీసుకున్నారు. వారిలో ఇద్దరిని మినహా అందరినీ క్రమంగా వదిలి వేశారు.

కాని నారాయణరావునూ, గండయ్యనూ పోలీస్ ఆక్షన్ (అంటే 17 సెప్టెంబర్ 1948) తరువాత కూడా సుమారు 11 నెలలు నిర్బంధంలోనే ఉంచారు. ఇది చాలా విచారించదగిన విషయమని అంతా అనుకున్నారు.





ఎలాగైతేనేమి నారాయణరావు పవార్, గండయ్యలు కూడా విడుదలయ్యారు. ప్రజాజీవితంలో కలిసిపోయారు.

**చరిత్రాత్మకమైన అభియోగం :**

బాంబు విసిరిన వారి మీద పోలీసులు పెట్టిన అభియోగం చారిత్రాత్మకమైనది. దేశమంతటా సంచలనం సృష్టించింది. హైదరాబాద్ రాష్ట్రాన్ని భారత దేశంలో విలీనం చెయ్యటానికి జరిపిన పోరాటంలో హైదరాబాద్ పాలకుడైన నిజాం మీద బాంబు విసరటం కన్న మహత్తర కార్యం ఇంకేముంటుంది? న్యాయమూర్తి మహ్మద్‌ముర్తుజా ఖాన్ సమక్షంలో విచారణ జరిగింది. అపరాధ పరిశోధన శాఖ అసిస్టెంట్ కమీషనర్ (నగరశాఖ) ఫజల్ రసూల్‌ఖాన్ అభియోగ విచారణ జరిపించాడు. న్యాయస్థానంలో వాంగ్మూలమిస్తూ...

"న్యాయస్థానంలో హాజరు పరచిన నారాయణరావు, గండయ్యలను తానెరుగుదుననీ, శిక్షాస్మృతి, మందు గుండు సామాగ్రి నియమాలు, హైదరాబాద్ రక్షణ సూత్రాల కింద వీరు నిందితులని చెప్పారు. విఠల్‌రావు ఒక్కడు అప్రూవర్‌గా మారాడు. న్యాయస్థానంలో హాజరున్న వారు కాక, లక్ష్మణ్‌రావు, కల్బుర్కర్, బాలయ్య, గాలయ్య, విశ్వనాథ్, బాబూరావు, నారాయణస్వామి, బసవరాజులు రాష్ట్రంలో అలజడి కలుగజేసి, నిజాం ప్రభుత్వాన్ని స్తంభింపచెయ్యడానికి శాయశక్తులా ప్రయత్నించారు.

అందుకు బాంబులు, చేతి గ్రేనేడ్‌లు, డైనమెట్లు తయారీకి పూనుకోవాలని, రోడ్లు, రైలు వంతెనలు, రైలుస్టేషన్లు పడగొట్టడానికి ప్రయత్నించాలని, పథకం వేసుకొని షోలా పూర్ శిబిరం నుండి పని చేయసాగారు.

షోలాపూర్‌లో మోటార్‌ను కిరాయకు తీసుకొని, నడుస్తున్న మోటార్‌పై బాంబులు ఎట్లావిసిరి వేయాలో నారాయణరావు, జగదీశ్వర్, విశ్వనాథ్‌లకు గుండ్రని బంతులతో శిక్షణ ఇవ్వబడింది. ఈ ముగ్గురు వట్టి చేతులతో అంటే బాంబులు తెచ్చుకోకుండా వచ్చారు. కొండా లక్ష్మణ్ శనివారం నాటికల్లా టి. లక్ష్మణ్ ద్వారా హైదరాబాద్‌లో అందజేస్తానని వాగ్దానం చెయ్యటమే అందుకు కారణం.

హైదరాబాద్‌కు వచ్చిన నారాయణరావు పవార్ పథకం ప్రకారం శని, ఆదివారాలు ఎదురుచూసి సోమవారం నాడు తిరిగి నారాయణస్వామితో షోలాపూర్ వెళ్లాడు. అయితే తాను ఇదివరకే టి. లక్ష్మణ్ ద్వారా బాంబులు నగరానికి పంపించినాడు కాబట్టి తిరిగి హైదరాబాద్ వెళ్లి అతని దగ్గర నుండి తీసుకోవలసిందని చెప్పి పంపివేశాడు. అప్పుడు

కొండాలక్ష్మణ్ బాపూజీ, బసవరాజు, నారాయణరావు, నారాయణ స్వామిల మధ్య ఒక నిర్ణయం జరిగింది.

**పగడ్బందీ పథకం :**

పోలీసులకు చిక్కితే రహస్యాలు బయట పడతాయి కాబట్టి పట్టుబడతారనే ప్రమాదం ఏ మాత్రమున్నా, వెంట ఉన్న విషం మింగి వేయాలనీ, లక్ష్మణ్ తమకు కనబడవచ్చు, లేదా కనబడకపోవచ్చు. కాబట్టి రెండుబాంబులు అదనంగా ఇయ్యవలసిందిగా వారు కోరారు. అందువల్ల వారు మరి రెండు బాంబులు యిచ్చారు. అవి తీసుకొని నారాయణరావు, నారాయణస్వామి హైదరాబాద్ తిరిగి వచ్చారు.

నారాయణరావు, మిగతా ముగ్గురు బాంబు వేసినరోజు శంకరరావు ఇంట్లో నారాయణరావు విషాన్ని మూడు చిన్న సీసాలలో నింపి ఇద్దరు సహచరులకూ ఇచ్చాడు. ఒకటి తన వద్ద ఉంచుకున్నాడు. తర్వాత సుల్తాన్ బజార్‌లోని సత్యనారాయణ సైకిల్ దుకాణానికి, ఆ తరువాత దేవనాథ్ ఫోటో స్టూడియోకి వెళ్లారు. ఈశ్వరయ్యతోను, నారాయణస్వామితోను గ్రూపు ఫోటో తీయించుకున్నారు. గండయ్య,నారాయణరావు, ఈశ్వరయ్య - ముగ్గురు హెడా షాప్‌లో సైకిళ్లు కిరాయకు తీసుకొని గాలయ్య ఇంట్లో పెట్టి కాలినడకన కింగ్‌కోఠీ రోడ్‌కు వెళ్లారు. స్కూలు సందు మలుపులో నారాయణరావు తాను ఉంటానని చెప్పాడు.

బొగ్గులకుంటలో మొదట ఈశ్వరయ్య ఉండాలని, ఇక గండయ్య, మెథడిస్ట్ స్కూలు గేటు ముందు ఉండాలని నిర్ణయించుకున్నారు.

సాయంత్రం 4.15 గంIIల కల్లా నిజాం సవారి బయలు దేరే సంరంభం మొదలైంది. సరిగ్గా సాయంత్రం 4.25 గంIIలకు నిజాం మోటారులో బయలుదేరాడు. ఆల్‌సెయింట్స్ సందు ముందరికి నిజాం మోటారు రాగానే (1947-డిసెంబర్ 4న) నారాయణరావు బాంబు విసిరాడు. బాంబు విసిరిన నాలుగు సెకన్లలో ప్రేలుతుంది. ఇదీ వారి పథకం.

**విప్లవ వీరుల పథకం పై ఆరా :**

గురితప్పిందని గమనించిన నారాయణరావు విషం తాగడానికి సిద్ధమై కింగ్ కోఠీ వైపుకు మళ్లాడు. డ్యూటీలో ఉన్న పోలీస్ సబ్ ఇన్స్‌పెక్టర్ జోసెఫ్ అతన్ని అరెస్టు చేసి ఉమర్ అనే అరబ్బును రప్పించి, జేబు కత్తిరింపచేయగా అందులో ఒక బాంబు, విషం సీసా పాకెట్ కనిపించింది.





ఈ సంఘటన జరుగగానే నిజాం మోటారు కింగ్‌కోఠీకి మళ్లింది. గండయ్య ఈశ్వరయ్య నిలుచున్న చోటికి కారు వెళ్లలేదు.



కింగ్ కోఠీలోని నిజాం స్వగృహం



నిజాంరాజు
మీర్‌ఉస్మాన్ అలీఖాన్



Narayan Rao Pawar



Gandiah (Gangaram), Pt. Vishwanath, R. Jagdish

ఇంతలో నారాయణరావు అరెస్టయ్యారనే వార్త అంతటా పాకి పోయింది. వాళ్లిద్దరు వెళ్లి పోయారు. ఈ ఇద్దరి గురించిన సమాచారం నారాయణరావు వలన తెలియలేదు.

అయినా వేరే మార్గం ద్వారా గండయ్య జాడ తెలుసు కొన్నారు. అసిస్టెంట్ కమీషనర్ - పాలమాకుల గ్రామంలో (హైదరాబాద్‌కు దగ్గర్లోని) అరెస్ట్ చేశారు. ఆయన వద్ద నుండి రెండు బాంబులు, విషం పొట్లం స్వాధీనం చేసుకొన్నారు. అవికాక ఒక రివాల్వర్, డజను గుళ్లతో పాటు బోలెడంత నిజాం వ్యతిరేక సాహిత్యాన్ని కూడా స్వాధీనం చేసుకొన్నారు.

**నారాయణరావు పవార్ ఇంట్లో సోదా :**

నారాయణరావు పవార్ బాలయ్య ఇంట్లో ఉండేవారు. ఆ ఇంటిని సోదా చేశారు. అక్కడ ప్రింటింగ్ ప్రెస్‌తో పాటు స్వాతంత్ర్య సమరానికి సంబంధించిన సాహిత్యం చాలా దొరికింది.

రేడియో, పత్రికల ద్వారా ఈ సమాచారం కొండాలక్ష్మణ్‌కు చేరింది. వివరాలు తెలుసుకొని రమ్మని ఆయన విఠల్‌రావును పంపించాడు.

హైదరాబాద్ రాగానే పోలీసులు విఠల్‌రావును అరెస్టు చేశారు. అతని వద్ద దొరికిన బాంబులు సైన్యానికి చెందినవి. ఇతను అప్రూవల్‌గా మారాడు. కాబట్టి జమానత్ మీద (పూచీకత్తు) వదలి పెట్టారు. బాంబుల పరీక్షకొరకు ఒక సైనికోద్యోగి కేప్టెన్ నూరుల్లా అహమద్‌ను రప్పించారు. విషాన్ని రసాయన పరీక్షకు పంపించారు.

**సాహసవీరులు తమ వాంగ్మూలంలో :**

ఈ సాహస వీరులు తమ వాంగ్మూలంలో "తాము నిజాంప్రభుత్వంతో పోరాటం జరపాలని ఎప్పుడో నిశ్చయించుకున్నామని, 15 ఆగస్టు 1947 నుండి తమ ప్రయత్నాలు, ఉధృతం చేశామనీ, ఇందుకు హైదరాబాద్‌లోని బేగంబజార్, సుల్తాన్‌బజారులలోనూ ప్రయత్నాలు జరిపామన్నారు. రాజా పన్నాలాల్ పిత్తీ ఇంట్లో ఒక గది తీసుకొని, అందులో ప్రజా ఉద్యమానికి సంబంధించిన పథకాలు వేసేవారమనీ, ఈ బృందంలో 13 గరు





వ్యక్తులున్నారనీ, సంస్థానం వెలుపలి నుండి ముస్లిం కాందిశీకులను తెచ్చి పెట్టడం వల్ల వారు సంస్థాన ప్రజలను నానా బాధలు పెడుతూ ఇక్కడి వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారనీ పేర్కొన్నారు.

వీరంతా పట్టుబడి జైలులో ఉన్నప్పుడు మాఫీనామా ఇస్తే (తప్పైందని ఒప్పుకుంటే) విడుదల చేస్తామన్నారు.

ఇంతటి వీరోచిత పోరాటం చేసిన వారు "మాఫీనామా" (అంటే క్షమాపణ) ఎలా వేడు కుంటారు? అందుకు నారాయణ ససేమిరా ఒప్పుకోలేదు. చివరకు 21 నెలల జైలు శిక్ష అనుభవించి 1949 ఆగస్టు 10 తేదీన విడుదలయ్యారు.

నిజాం మీద బాంబు వేయడమంటే నిరంకుశత్వం దుర్మార్గం మీద, అత్యాచారాల మీద, ప్రజా పీడనల మీద బాంబు వేయడమనే అర్థం. ఇంతటి సాహస వీరులు దక్షిణ భారత దేశానికే గర్వకారణం అనక తప్పదు.

*"మాకు ఉరి శిక్ష పడితే పడనివ్వండి. నిజాం పరమ ద్రోహి. కిరాతకుడు. అతన్ని హత్య చేసి జనాన్ని చైతన్య వంతుల్ని చేయాలనేదే మా లక్ష్యం. కోర్టు మమ్మల్ని విడుదల చేస్తే ఆ కిరాతకుణ్ణి అంతం చేసి తీరుతాం. ప్రాణాలు మాకు తృణ ప్రాయం.*

(కోర్టు హాలులో సవాలు చేసిన నారాయణ రావు పవార్)

**నెలకొన్న భయానక వాతావరణం :**

*"సల్తనత్ ఇస్లామియా ఆసఫియా" ....*

*..... ఏర్పాటుకు నిరంతరం కలలు కంటూ నిజాం తనకు ఎదురు తిరిగిన వాడినల్లా నామరూపాలు లేకుండా చేస్తూ వచ్చారు. అంతటి భయానక వాతావరణం నెలకొంది ఆనాడు. హైదరాబాద్ సంస్థానంలో నెలకొన్న పరిస్థితి.*

*దేశం నాకేమి ఇచ్చిందనేది కాకుండా నా వంతుగా దేశానికి ఏమి ఇస్తున్నాను అని ప్రతి ఒక్క రు మనస్సాక్షిగా సమాధానం చెప్పుకోవాలి. అలాంటి దృక్పథం యువకుల్లో రావాలి.*

*నారాయణరావు పవార్ విడుదలైన తర్వాత మొదట ల్యాండ్ మార్ట్‌గేజ్ బ్యాంకులో అసిస్టెంట్ సెక్రటరీ గా చేశారు. తర్వాత ఆర్యన్ కో ఆపరేటివ్ బ్యాంక్‌లో పని చేస్తూ రిటైర్ అయ్యారు.*

*నిజాం అశ్వక దళం ఉండే షెడ్‌లో టైం బాంబు పేల్చాం, ఇతర చిన్నా చితకా దాడులు చేశాం.*

*- నారాయణరావు పవార్*

# 19. హైదరాబాద్ చరిత్రపుటలలో చెరగని ముద్రలు

**ఆనాటి దక్కన్ రేడియో :**

1947లో హైదరాబాద్ సంస్థానంలో నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా మహోజ్వల పోరాటం జరుపబడింది. ఆనాడు దీనిని "భాగ్యనగర రేడియో ప్రసార"మన్నారు.

హైదరాబాద్ ప్రజాపోరాట సక్రమ నిర్వహణకై ఏర్పడిన అన్ని ప్రాంతీయ కార్యాలయాలు చేసిన వివిధ కార్యక్రమాలతో పాటు కర్నూలు కార్యాలయం ప్రత్యేకంగా నిర్వహించిన కార్యక్రమమే భాగ్యనగర రేడియో ప్రసారం.



పాగ పుల్లా రెడ్డి

ఇక ఈ కేంద్రం నుండి జరిగిన ప్రసారం ద్వారా ఇటు ఇండియన్ యూనియన్‌లోని అన్ని ప్రాంతాల వారికి హైదరాబాద్‌లో జరుగుతున్న నిజాం పోలీసు అత్యాచారాలు, రజాకార్ల రాక్షసకృత్యాలూ, భీభత్స కాండ హైదరాబాద్ ప్రజల వీరోచిత ప్రతిఘటనా కార్యక్రమాలు ప్రతిరోజు ప్రసారం చెయ్యబడ్డాయి.

అలా హైదారబాద్ ప్రజలకు అందరికీ రాష్ట్రంలోని కిరాతకాలూ, కాంగ్రెస్ సాహస కృత్యాలూ తెలియజేస్తూ ఉత్సాహాన్ని రేకెత్తింపజేశారు. అసలు భాగ్యనగర రేడియో అంటేనే మనకు గుర్తుకు వస్తారు పాగా పుల్లారెడ్డిగారు. ఆనాటి సాహసోపేతమైన ఈ భాగ్యనగర రహస్య రేడియో ప్రసారాన్ని ముచ్చటించినప్పుడు గద్వాల ప్రాంతంలో ఆనాడు నిజాంనిరంకుశ విధానాలపై ధ్వజమెత్తి హోరాహోరీ పోరాటం సలిపిన వనపర్తి రఘునాథరెడ్డి, కోదండ రామిరెడ్డి, పల్లెపాడు గోవర్ధన్‌రెడ్డి, గొట్టిముక్కల కృష్ణమూర్తి, గడియారం రామకృష్ణ శర్మ, పి.యన్. మూర్తి, టి. నాగప్ప, కె. వెంకటరెడ్డి లాంటి ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు మనమందు





ఆనాడు దక్కన్ రేడియో కన్న అధిక శక్తివంతమైన ట్రాన్స్‌మీటర్‌లో అమర్చడం జరిగింది. ఈ కేంద్రం నుండి తెలుగులో గడియారం రామకృష్ణ శర్మ, ఉర్దూలో టి. నాగప్ప, కమతం వెంకటరెడ్డి ఇంగ్లీషులో వార్తలు చెప్పేవారు. గొట్టి ముక్కల కృష్ణమూర్తి వార్తలను సేకరించే పనిలో ఉండేవారు.

అలా ఆనాడు నాలుగు మాసాల పాటు హోరాహోరీ పోరాటం జరిగింది. 1947 నవంబర్ 30 నాడు భారత ప్రభుత్వంతో ఒక తాత్కాలిక ఒప్పందం కుదిరింది. ఈ ఒడంబడిక ప్రకారం భాగ్యనగర్ రేడియో ప్రసార కేంద్రాన్ని కట్టివేయవలసి వచ్చింది.

అయితే గాంధీజీ హత్యకు గురైన 1948 జనవరి 30న కర్నూలు క్యాంపు అధినేత పాగ పుల్లారెడ్డి చివరి ప్రసారంలో ఈ కేంద్రానికి స్వస్తి పలికారు.

భాగ్యనగర్ రేడియో కేంద్రం వల్ల ముఖ్యంగా మూడు ప్రయోజనాలు కలిగాయి. స్టేట్ కాంగ్రెస్ ఉద్యమానికి ప్రజానీకంలో ప్రచారం జరపడానికి చక్కని అవకాశం కలిగింది. లక్షలాది శ్రోతలు స్టేట్ కాంగ్రెస్ దృక్పధాన్ని ఆశయాలను, లక్ష్యాలను బాగా తెలుసుకోగలిగారు.

రజాకార్లు, మజ్లిస్‌వారు మతోన్మాదులైన నిజాం పోలీసులు, సైనికులు సంస్థానంలో ప్రజలపై జరిపే అత్యాచారాలను, దుండగాలను, దోపిడీలను, దురంతాలను బట్టబయలు చేసి వారి నిజస్వరూపాన్ని బహిర్గతం చేసే వీలు కలిగింది. సంస్థానంలో ఎటువంటి రాక్షసత్వం స్వైర విహారం చేస్తున్నదో అందరూ తెలుసుకోగలిగారు.

ఈ కేంద్రం ప్రసారాలను సంస్థానంలో ప్రజలు వింటున్నారని గ్రహించిన నిజాం ప్రభుత్వం పబ్లిక్ రేడియోలు బంద్ చేయించింది. కాని ఇండ్లల్లో ఎవరికి వారు చక్కగా భాగ్యనగర్ కార్యక్రమాలు వినేవారు. స్టేట్‌కాంగ్రెస్ యదార్థ ప్రచారం నిరాటంకంగా సాగిపోయింది.

అయితే ఈ రేడియో వింతలలో ఒక వింత అని చెప్పకోక తప్పదు. ఇది దేశంలో అప్పటికి మరే ప్రాంతంలోను, ఉద్యమంలోను జరగని పని.

★☆★

# ధైర్యాన్ని నూరి పోసిన జ్ఞానకుమారి హెడా

హైదరాబాద్ సంస్థానంలో రజాకార్ల దౌర్జన్యాలు పెచ్చు మారిన సందర్భంలో జ్ఞాన కుమారి హెడా రాష్ట్ర మంతటా పర్యటించి ప్రజల్లో ధైర్యాన్ని నూరిపోసింది. ఆచార్య బన్సాలీ వెంట కాలినడకన పెక్కు గ్రామాల్లో తిరిగింది. ప్రజల కష్ట సుఖాలు తెలుసుకుంది. అరాచక శక్తుల నుంచి త్వరలోనే ప్రజలకు విముక్తి లభిస్తుందని హామీ యిచ్చింది.



జ్ఞానకుమారి హెడా

ఆ రోజుల్లో స్వాతంత్ర్యోద్యమంలో మహిళలు పాల్గొనడమే చాలాఅరుదు. అయితే జ్ఞానకుమారి హెడాగారు తాను స్వయంగా ఉద్యమంలో పాల్గొనడమే కాక ఎందరో మహిళలు ఉద్యమంలో పాల్గొనేలా చేసింది. ఆమె మంచి వక్త. బాల్యం నుంచి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడంతో ఆమె విద్యకు పెక్కుసార్లు అంతరాయం కలిగింది. 1930లో ఆమె మొదటిసారి అరెస్టయినప్పుడు ఆమె వయస్సు 17 సం॥లు మాత్రమే! ఆమె డిగ్రీని పూర్తి చేయలేక పోయింది.

హైదరాబాద్ సంస్థాన స్వాతంత్ర్యోద్యమంలో ఆమె 1942లో ఒకసారి, 1947లో మరొకసారి అరెస్టయి జైలు శిక్షననుభవించింది. ఉత్తర ప్రదేశ్‌లోని బులంద్ షహర్ జిల్లా ఖుర్జాలో 1918లో పుట్టిన ఈమె హైదరాబాద్ నగరంలో ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు హరిశ్చంద్ర హెడాను పెళ్లి చేసుకొని హైదరాబాద్ వాసి అయింది.

1947-49 లమధ్య కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సాయుధ పోరాటం జరిపారు. ఈ పోరాటంలో భీతిల్లన ప్రజలు గ్రామాలను విడిచిపెట్టి వెళ్లిపోయారు.





పోలీసు చర్య తర్వాత శాంతిభద్రతల పరిరక్షణ నిమిత్తం పోలీసులు రంగంలోకి దిగి కమ్యూనిస్టుల హింసా వాదాన్ని అంతకంటే తీవ్రంగా అణచివేయడానికి ప్రయత్నించారు. పగలు పోలీసుల దౌర్జన్యంతో, రాత్రిలు కమ్యూనిస్టుల దౌర్జన్యంతో తెలంగాణా గ్రామాలు హాహాకారాలు చేశాయి. ముఖ్యంగా ఈ దిన్కీ సర్కార్, రాత్‌కీ సర్కారుతో నల్లగొండ మొదలైన జిల్లా వాసులుఅట్టుడికి పోయారు. ఈ దౌర్జన్య విధానాన్ని అహింసా పద్ధతిలో ఎదుర్కొనటానికి స్వామీజీ నాయకత్వంలో కొందరు స్టేట్ కాంగ్రెస్ నాయకులు బాధిత గ్రామాల పర్యటనకు పూనుకొన్నారు. వారిలో జ్ఞానకుమారి హెడా ఒకరు. వీరి రాకతో గ్రామ ప్రజల్లో శాంతి నెలకొంది. ప్రజలు హింసా వాదానికి స్వస్తి చెప్పారు.



Student Satyagrahis of 8th, March, 1948.

# సెప్టెంబర్ 17న నిజాం రేడియో ప్రకటన

"నా ప్రియమైన ప్రజలారా భారత దేశపు గవర్నర్ జనరల్ అయిన హిజ్ ఎక్సెలెన్సీ రజగోపాలాచారి గారి పేర ఈ క్రింది సందేశాన్ని తెలుపుటకు సంతసిస్తున్నాను.

నా ప్రభుత్వం రాజీనామా చేసింది. రాజకీయ పరిస్థితులను పూర్తిగా హస్తగతం చేసుకోమని కోరారు.

ఈ చర్య అంతకు ముందు తీసుకోనందుకు విచారిస్తున్నాను. ఇప్పుడు చాలా ఆలస్యమైంది. ఈ సున్నితమైన సమయంలోనేనేమీ చేయలేకుండా ఉన్నాను. మొత్తానికి నా సైన్యాన్ని యుద్ధ విరమణ చేయవలసిందిగా ఆదేశించానని గవర్నరు జనరలు గారికి తెలియజేస్తున్నాను. ఇది కాక భారత సైన్యాలను బొల్లారం, సికింద్రాబాద్‌లోని సైనిక స్థావరాలలో ఉండటానికి అనుమతిస్తున్నాను. కొత్త మంత్రివర్గం ఏర్పడే వరకు కొత్త ప్రధానమంత్రి నియమించబడే వరకు దైనందిన పరిపాలనా వ్యవహారాలలో నాకు సహాయ పడటానికి ఒక కమిటీని ఏర్పరచాను. అందులో ఈ క్రింద పేర్కొన బడ్డ సభ్యులుంటారు.

1. హిజ్ హైనెస్ బరారు యువరాజు (సర్వసేనాని)
2. మేజరు జనరల్ అహ్మద్ అల్ ఇద్రుస్ (కమాండరు)
3. నవాబుద్దీన్ యార్జంగ్ (పోలీసు కమీషనర్)
4. శ్రీరామాచారి, వకీలు
5. అబుల్ హసన్ సయ్యదు (ఇత్తెహాదుల్‌ముస్లిమీన్ మాజీ అధ్యక్షుడు)

నేను సర్ మిర్జా ఇస్మాయిల్, నవాబు జైన్ యార్ జంగ్, దివాను బహద్దూర్ అరముందు అయ్యంగారలను కూడా ఆహ్వానిస్తున్నాను. రాక పోకల వ్యవస్థ స్థిరపడగానే కొత్త పరిస్థితిని ఎట్లా ఎదుర్కోవాలో వారితో చర్చిస్తాం. సంప్రదింపులు జరుపుతాం.

స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులయిన స్వామి రామానంద తీర్థగారిని వెంటనే విడుదల చయవలసిందిగా ఆజ్ఞాపించడం జరిగింది. ఈ కల్లోల పరిస్థితుల్లో స్వామీజీ హైదరాబాద్‌కు సహాయ పడతారని ఆశిస్తున్నాను. అదీ గాక స్టేట్ కాంగ్రెస్ కార్యాచరణ సంఘానికి విరుద్ధంగా జారీ చేయబడిన ఆజ్ఞలుగాని, వారెంట్‌లుగాని రద్దు చేయాలని కూడా ఆజ్ఞాపించాను. నేను నా మిత్రుడైన కె.ఎం. మున్షీ భారత ఏజెంటు జనరల్‌తో సంప్రదించాను. ఈ సందర్భంలో వారు నాకు చాలా సహాయపడ్డారనే విషయాన్ని ఒప్పుకుంటున్నాను."

★☆★





# ౨౦. హైదరాబాద్ విముక్తి పోరాటంలో ఎందరో వీరులు, శూరులు

ఎందరో వీరుల త్యాగఫలం, మనకు స్వేచ్ఛా వాయువులను అందించింది. ప్రజల బానిస సంకెళ్లను ఛేదించటానికి వారు సర్వస్వం త్యాగం చేశారు. తమ చదువూ సంధ్యలను మధ్యలోనే వదిలేశారు. ఉద్యోగాలను తృణప్రాయంగా త్యజించారు. ప్రాణాలకు సైతంతెగించి అడుగడుగునా నిజాంకు ఎదురు నిలిచారు. అరెస్టులు, లాఠీచార్జీలు వారిని ఏమీ చేయలేక పోయాయి. స్వతంత్ర భారతి స్వేచ్ఛాగీతం హైదరాబాద్ సంస్థానంలోనూ ఆలపించేందుకు వారు చేయని సాహసం లేదు. తెగింపులేదు. కొందరు తమ కలాలనే తమ ఆయుధాలుగా ఎక్కుపెట్టి ప్రజలను చైతన్య వంతులను చేస్తే మరి కొందరు తుపాకులు చేత బట్టి "బాంచెన్ నీ కాల్మొక్కుతా" అంటూ అణిగి మణిగి జీవించే దీనుల్లోనూ విప్లవ జ్వాలలు రగిలించారు.

హైదరాబాద్ రాష్ట్రంలో జరిగిన స్వాతంత్ర్యోద్యమం ఎందరో వీరులను, సాహస వంతులను, త్యాగధనులను సృష్టించింది. వీరందరిలో నారాయణరావు పవార్ తలమానికమని చెప్పుకోవచ్చు.

నిజాం నవాబు గద్దెనెక్కిన నాటి నుండి మత దురహంకారంతో, కుత్సితమైన స్వార్థంతో తన రాచరికపు గద్దెను నిలుపుకోవడానికి చేసిన దురంతాలకు అంతులేదు. తన కండ్ల ముందు జరిగే మానభంగాలను, దోపిడీలను, హత్యలను చూసి నారాయణరావు హృదయం చలించింది. వీటన్నింటికీ మూల కారకుడైనవాడు నిజామే అని నిశ్చయించు కున్నాడు. అతన్ని హతమారుస్తే ఈ దురంతాలు ఆగిపోతాయనే దృఢ విశ్వాసానికి వచ్చాడు పవార్. జీవితంపై ఆశను వదులుకొని, దేశమాత చరణాలకు చిత్తశుద్ధితో నమస్కరించి జనకంటకుడైన నిజాం మీద బాంబు వేసి హైద్రాబాద్ ప్రజలకు విముక్తి కలిగించాలనేదే ఆయన చిరవాంఛ.

నిజాం రాజు ఉస్మాన్ అలీ ఖాన్ సంస్థాన ప్రజలపై జరుపుతున్న హింసా కాండలు, దౌర్జన్యాలు తారా స్థాయి నందుకున్నాయి. నిజాం ప్రభువు బాధలు పడలేక, చెప్పుకోడానికి గోడు వినిపించుకోడానికి వినేవాడు లేక ఎందరో తమ గ్రామాలు విడిచి వలస వెళ్లారు. కాని కొంత మంది యువకులు నిజాం అంతు తేలుద్దామనే దృఢ సంకల్పంతోనే తమ తమ నెలవులు విడిచి సరిహద్దు ప్రాంతంలో శిబిరాలు ఏర్పాటు చేసుకొని "బతికితే స్వరాజ్యం" లేక పోతే "వీరస్వర్గం" అనే దృఢ సంకల్పంతో అంతిమ పోరాటానికి సమాయత్తమయ్యారు. అలాంటి అనేక శిబిరాలలో షోలాపూర్ శిబిరం ఒకటి.

★☆★

# దేశసేవకోసం బ్రహ్మచర్య

## స్వామీ రామానందతీర్థ



పూర్తిపేరు వెంకటేశ్ భావన్‌రావ్ ఖేడ్గీకర్.1903లో గుల్బర్గా జిల్లా చినమల్లిలో జన్మించారు. హైదరాబాద్‌లో నివాసం ఏర్పరచుకొన్నారు. ఎం.ఏ. వరకు చదివారు. మాతృదేశ సేవ కోసం బ్రహ్మ చారిగా ఉండిపోయారు. 1932లో సన్యాసం స్వీకరించారు. 1938లో రాజకీయాల్లో ప్రవేశం. నిజాం హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను నిషేధించినప్పుడు సత్యాగ్రహం చేసి జైలు శిక్షననుభవించారు.

1942-50 వరకు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉన్నారు. భారత విలీనోద్యమంలో 1948 జనవరి నుంచి సెప్టెంబర్ వరకూ హైదరాబాద్, సంగారెడ్డి, గుల్బర్గా జైళ్లలో డిటెన్యూగా నిర్బంధంలో ఉన్నారు.

1952-62 వరకు లోక్‌సభ సభ్యులుగా ఉన్నారు. ఆ తరువాత సర్వోదయ సిద్ధాంతాల ప్రచారానికి పూనుకున్నారు. తూర్పు గోదావరి జిల్లా పిఠాపురం వద్ద "శాంతి ఆశ్రమం" స్థాపించారు.

---

# ఆంధ్ర జనసంఘం స్థాపకులు

## బూర్గుల రామకృష్ణారావు



మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకా పడ్కల్‌లో 1899లో జన్మించారు. బహుభాషా కోవిదుడు. తెలుగు, సంస్కృతం, పర్షియన్ భాషల్లో పండితుడు.

1921లో హైదరాబాద్‌లో ఆంధ్రజనసంఘం స్థాపించారు. హిందూ-ముస్లిం ఐక్యతకు కృషి చేశారు. హైదరాబాద్ స్వదేశీలీగ్ కార్యదర్శి, 1938లో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ప్రావిన్షియల్ కమిటీ సభ్యులు. 1942 అక్టోబర్‌లో విక్టరీ ప్లే గ్రౌండ్‌లో జండా ఎగురవేసి అరెస్టయ్యారు. నిజాం ప్రభుత్వం బహిరంగ సభలను నిషేధించగా ఒక సభలో ప్రసంగించి, సత్యాగ్రహం చేశారు. విలీనోద్యమంలో పాల్గొన్నందుకు 1947లో నిర్బంధానికి గురయ్యారు.

1950-52లలో హైదరాబాద్ స్టేట్ క్యాబినెట్‌లో విద్య, రెవిన్యూ మంత్రిగా ఉన్నారు. 1952-56 మధ్య ముఖ్యమంత్రిగా పనిచేశారు. 1957 నుంచి 1962 వరకు గవర్నర్‌గా వ్యవహరించారు.







# తెలంగాణా విప్లవ జ్వాల

## సురవరం ప్రతాపరెడ్డి

1898 మే 28న మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల్ సంస్థానంలోని బోరెవెల్లి గ్రామంలో జన్మించారు. దేశభక్తి, ప్రజా శ్రేయస్సు, భాషాభిమానం పరమార్థంగాజీవించారు.

నిజాం నవాబు నిరంకుశ పాలనపై అక్షరాలతో అగ్నివర్షం కురిపించి తెలంగాణా ప్రజల్లో చైతన్యం రగిలించిన యోధుడు సురవరం ప్రతిప రెడ్డి. న్యాయవాద వృత్తిలో ఇమడలేక తెలంగాణా ప్రజల చైతన్యం, దారిద్ర్యం చూడలేక ప్రజా జీవితంలోకి అడుగుపెట్టారు. బానిస బతుకుల విముక్తి కోసం 1926లో "గోలకొండ" పేరుతో పత్రికను ప్రారంభించారు.

నిజాం అరాచకాలకు వ్యతిరేకంగా పత్రికలో తన కలం ద్వారా నిప్పులు చెరిగారు. తెలంగాణా ప్రజల్లో జాతీయభావాలను నింపడానికి అహర్నిశలు కృషి చేశారు.

గొప్ప రచయిత, 40కి పైగా గ్రంథాలు రాశారు.

---

# గెరిల్లా పోరాట యోధుడు

## రావినారాయణ రెడ్డి



నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా బొల్లేపల్లిలో 1908లో జన్మించారు. విద్యార్థిగా ఉన్నప్పుడే ఉద్యమాల్లో పాల్గొన్నాడు. ఇంటర్‌మీడియెట్ చదువు మానేసి శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 1938లో హైదరాబాద్‌లో స్టేట్ కాంగ్రెస్ వ్యవస్థాపక సభ్యులు. స్టేట్ కాంగ్రెస్‌ను నిజాం నిషేధించినందుకు 1938లో సత్యాగ్రహం చేశారు. రెండు నెలల జైలు శిక్ష ననుభవించారు.

శ్రీ రావి హైదరాబాద్ స్టేట్‌లో కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరు. 1941లో చిలుకూరులోనూ, 1944లో భువనగిరిలోనూ, 1945లో ఖమ్మంలోనూ జరిగిన ఆంధ్ర మహాసభ (తెలంగాణ) సమావేశాలకు అధ్యక్షత వహించారు.

నిజాంకు వ్యతిరేకంగా రైతు ఉద్యమాన్ని నడిపారు. నిజాం నిరంకుశ పాలనకు, రజాకర్ల దురంతాలకు వ్యతిరేకంగా గెరిల్లా పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. భూమిలేని పేదలకు తన 500 ఎకరాల సొంత భూమిని పంచి పెట్టారు.

## కలం వీరుడు షోయబ్

ఆనాడు షోయబ్ ఓ గొప్ప పత్రికా రచయిత.



"పగటి ప్రభుత్వం - రాత్రి ప్రభుత్వం" పేరుతో ఆయన రాసిన సంపాదకీయం నిజంగా ఆనాటి సంఘటనలకు అద్దం పట్టింది. నిర్భయంగా యదార్థాన్ని ప్రజలకు చూపుతూ షోయబ్ "ఇమ్రోజ్ (పత్రిక)ను ప్రజల వాణిగా తీర్చిదిద్దాడు. ఖాసీం రజ్వీ ఒక సారి ఉపన్యాసంలో ఆసఫియా ధ్వజం ఎర్రకోటపై ఎగురుతుందని బీరాలు పలికారు. ఈ విషయాన్ని ఖండిస్తూ షోయబ్ ఇమ్రోజ్‌లో చేసిన వాఖ్యలను తట్టుకోలేక పోయారు. యువకుడైన షోయబ్ రజాకార్లను ధైర్యంగా ఎదురించారు.

ముస్లింల ఐక్యతను విచ్ఛిన్నం చేసే శక్తులు సజీవంగా ఉండడానికి వీలులేదు. భారత ప్రభుత్వ ఏజెంట్లుగా ఉంటూ మా సమైక్యతను ధ్వంసం చేయాలనే కీలు బొమ్మల చేతులు ఉండడానికి వీలులేదు"అని అంటూ ఆక్రోశాన్ని వెలిగక్కాడు.

1948 ఆగస్టు 21న రజాకార్లు, పత్రికా కార్యాలయం నుండి ఇంటికి వెళుతున్న షోయబుల్లాఖాన్‌ను దారుణంగా కాల్చి చంపారు.

అలా దేశభక్తి, వృత్తి ధర్మం, అంకితభావానికి షోయబ్ బలైపోయారు.

## నిర్బంధాలకు జంకని వీరుడు

విద్యార్థి దశలోనే 1938లో హైదరాబాద్ సంస్థానంలో జరిగిన వందే మాతరం ఉద్యమం సందర్భంగా హైదరాబాద్ వైద్య కళాశాలలో సమ్మెను నిర్వహించారు. ఆంధ్రమహాసభ కార్యకర్త. 1940 నుంచి భారత కమ్యూనిస్టు పార్టీ సభ్యులు.



జమీందారీ, జాగీర్దారీ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొన్నందుకు నిజాం ప్రభుత్వం 1946 నవంబర్ 28న అరెస్టు చేసి జైల్లో పెట్టింది. 1947 మే 7న జైలు నుంచి తప్పించుకున్నారు.

అఖిల భారత్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను స్థాపించి దానికి ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు.

1918 జూలై 1న హైదరాబాద్‌లో జన్మించారు.

**- డా॥ రాజబహదూర్ గౌర్**





## ఉద్యమ ప్రచారకుడు కోదాటి నారాయణరావు



1914లో నల్లగొండ జిల్లా హుజూర్ నగర్ తాలూకా రేపాల గ్రామంలో జన్మించారు. హైదరాబాద్‌లో నివాసం ఏర్పాటు చేసుకొన్నారు. న్యాయశాస్త్రం పట్టాపుచ్చుకున్నారు.

1941లో చిలుకూరులో జరిగిన ఆంధ్ర మహాసభ 8వ సమావేశంలో విశాలాంధ్ర తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1947-48లో ఇండియా విలీనోద్యమంలో పాల్గొన్నారు. పన్నుల నిరాకరణకు ప్రచారం చేశారు. రజాకార్ల దాడులను ఎదుర్కొనేందుకు గ్రామీణ దళాలను ఏర్పరచారు.

కొన్నాళ్లు ఏఐసీసీ సభ్యులు - గ్రంథాలయ, హరిజన, ఖాదీ ఉద్యమాల్లో ఎక్కువగా కృషి చేశారు. మంచి రచయిత.

హైదరాబాద్ స్టేట్ ప్రజల్లో మంచి చైతన్యం కలిగించారు.

## చిన్నతనం నుంచే పోరుబాట - డాక్టర్ జి.యస్. మేల్కోటే



గోపాల్ సుబ్బకృష్ణ మేల్కోటే 1901లో గంజాం జిల్లా బరంపురంలో జన్మించారు. హైదరాబాద్‌లో నివాసం ఏర్పరచుకున్నారు. చిన్నవాడే ఉద్యమంలో పాల్గొన్నారు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని లాఠీ చార్జీకి గురయ్యారు. 1931లో కరాచీ కాంగ్రెస్‌కు హైదరాబాద్ నుంచి ప్రతినిధిగా వెళ్లారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అరెస్టయ్యారు. 1947 ఆగస్టు 15న జాతీయ పతాకాన్ని ఎగరవేయబోయి అరెస్టయి హైదరాబాదు జైలులో జైలు శిక్షననుభవించారు.

1952 - 56 వరకు హైదరాబాద్ ప్రభుత్వ ఆర్థిక మంత్రిగా పనిచేశారు. 1957 లోక్‌సభ సభ్యునిగా ఉన్నారు.

## సిటిజన్ ప్రొటెక్షన్ కమిటీ వ్యవస్థాపకులు

## "కొండా లక్ష్మణ్ బాపూజీ"



రజాకార్ల మితిమీరిన దౌర్జన్యాలవల్ల ఆనాడు భయాందోళనలను తొలగించి వారిలో ధైర్యాన్నీ, శాంతినీ నెలకొల్పడానికి కొండా లక్ష్మణ్ బాపూజీ నాఆడు "సిటిజన్ ప్రొటక్షన్ కమిటీ"ని ఏర్పాటు చేశారు. అంటే ప్రజలు తమకు తాము రక్షించుకునే విధానాన్ని నెలకొల్పారు. ఈ కమిటీకి కొండా లక్ష్మణ్‌గారే అధ్యక్షులుగా ఉన్నారు.

తెలంగాణా ప్రాంత ప్రజల్లో ఈ స్వయం రక్షక విధానం తొందరలోనే వ్యాపించి పోయింది. ప్రజలు నగర ప్రాంతం, పట్టణ ప్రాంతం, గ్రామ ప్రాంతాల్లోను తమపై రజాకార్లు జరుపుతున్న దౌర్జన్యాలను ఎదిరించడానికి వారికి ఆయుధాలు ఉపయోగించే విధానంలోశిక్షణ ఇవ్వబడింది. గ్రామాల్లోని వాడ వాడల్లో ఇలాంటి రక్షణ దళాలు రూపొందించుకోవడం జరిగింది. యువకులకు శిక్షణ కూడా ఇవ్వబడింది.

ఇలా ఆనాడు కొండా లక్ష్మణ్ గారి ఆధ్వర్యంలో తమ ప్రాంతాల రక్షణ కోసం ప్రజల్లో చైతన్యం తీసుకురాబడింది.

ఈ విషయం ప్రభుత్వం దృష్టికి వచ్చింది. ప్రభుత్వం కక్షగట్టి కొండా లక్ష్మణ్‌ను అరెస్టు చెయ్యడానికి పోలీసులను పంపించింది. పోలీసులు వారి ఇంటిపై దాడి జరిపారు. విషయం తెలుసుకొన్న కొండాలక్ష్మణ్ గారు రహస్యంగా దొడ్డి దారి గుండా తప్పించుకున్నారు. అజ్ఞాత వాసంలోకి వెళ్లి పోయారు. రహస్య జీవితం గడుపుతూనే హైదరాబాద్ ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలనేఉద్యమం నడిపారు.

ఆ తరువాత షోలాపూర్ క్యాంప్‌ను నిర్వహించారు. అక్కడ మూడు విధాల కార్యక్రమాలను నిర్వహించారు.

1. హైదరాబాద్ రాష్ట్రంలో రజాకార్ల దౌర్జన్యాలకు భయపడి నిర్వాసితులైన వారికి పునరావాసం కల్పించడం.





2. నిజాం ప్రభుత్వంలో రజాకార్లు గోవా నుండి ఆయుధాలను రహస్యంగా హైదరాబాద్ రాష్ట్రంలోకి తీసుకువెళ్లే వాహనాలను పట్టించి మహారాష్ట్ర పోలీసులకు అప్పగించడం.

3. హైదరాబాద్ రాష్ట్రం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావడానికి ప్రజా ఉద్యమాల కార్యక్రమాన్ని రూపొందించడం.

ఈ సందర్భంలోనే నారాయణరావు, గండయ్య, లక్ష్మణ్‌లు షోలాపూర్‌వచ్చి కొండాలక్ష్మణ్‌ను కలుసుకొన్నారు. వారి సహాయ సహకారాలను పొందారు.

వీరి ఆధ్వర్యంలోనే షోలాపూర్‌లో కిరాయి మోటారు తీసుకొని నడుస్తున్న మోటారుపై బాంబు ఎట్లా విసిరి వేయాలో నారాయణరావు, జగదీష్, విశ్వనాథ్‌లకు గుండ్రని బంతులను తయారు చేయించి శిక్షణ ఇవ్వబడింది. అలా వీరు షోలాపూర్‌లో శిక్షణ పొంది హైదరాబాద్‌కు వెళ్లారు. అలా పథకం వీరి ఆధ్వర్యంలో రూపొందించబడింది.

---

## గాంధీజీ ఆశయాలే స్ఫూర్తి-తోటపల్లి గాంధీ

## బోయిన పల్లి వెంకట రామారావు



90 సంవత్సరాల బి. వెంకటరామారావు కరీంనగర్ జిల్లా తోటపల్లి గ్రామంలో 1920 సెప్టెంబర్ 2న జన్మించారు. భూస్వామ్య కుటుంబంలో పుట్టినా పాలేర్లకు జీతాలు పెంచాలని నిజాం కాలంలో శాంతి మార్గంలో ఉద్యమించారు.

నిజాం నవాబు దుర్మార్గాల పాలనకు వ్యతిరేకంగా పోరాడాలనే ఆలోచనకు పూర్తి స్థాయి అంకురార్పణ 1935లో సిరిసిల్లలో జరిగిన తెలంగాణ చతుర్థాంధ్ర మహాసభ, అక్కడే మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి లాంటి వారు పరిచయమయ్యారు. గ్రంథాలయోద్యమంలో పాల్గొని, సంఘ సంస్కరణల కోసం పాటుపడుతూ గ్రామ పెత్తందారుల ఆగ్రహానికి గురై గ్రామ బహిష్కరణకే గురువయ్యారు.

1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 12 నెలలు జైలుశిక్ష అనుభవించారు. జైలులో ఖైదీల బాగోగుల కోసం పోరాడారు. స్వాతంత్ర్య సరమ యోధుల సంక్షేమం కోసం పోరాడుతుంటారు. ఇపుడు స్వాతంత్ర్య సమర యోధుల ఎంపిక స్క్రీనింగ్ కమిటీకి చైర్మన్.

# ఆర్యసమాజ్ ఉద్యమం



హైదరాబాద్ స్వాతంత్ర్య సమరవీరుల స్ఫూర్తి ప్రదాత
లోకమాన్య జయప్రకాశ్ నారాయణ్



పండిత వినాయకరావు విద్యాలంకార్



పండిత నరేంద్రజీ



పండిత వందేమాతరం రామచంద్రరావు



యన్. వెంకటస్వామి



బన్సీలాల్ వ్యాస్





# ఆనాటి ఉద్యమంలో మహిళలు



జ్ఞాన కుమారి హెడా



విమలా మేల్కోటే



సామ్రాజ్య లక్ష్మి



పద్మావతీ నాయుడు



శంకరదేవి

## విద్యార్థి ఉద్యమ కారులు



బి. సత్యనారాయణ రెడ్డి



సంతపురి రఘువీరరావు



పి.యజసూర్య నాయుడు



సి. జగన్నాథరావు



కె. చంద్రప్రకాశరావు



ఎస్.ఆర్. వెంకటేశం





## ఆల్ హైదరాబాద్ స్టూడెంట్స్ యూనియన్ నాయకులు



ఓంకార్ ప్రసాద్, జవాద్ రజ్వీ, బి. నర్సింగరావు, సి.హెచ్. రాజేశ్వరరావు, బి.ఎస్. పరాంజుపే, సి.హెచ్. హన్మంతరావు.



## ఉద్యోగం మాని ఉద్యమంలోకి
## సర్దార్ జమలాపురం కేశవరావు

1908లో మధిర తాలూకా యెర్రుపాలెంలో జన్మించారు. హైదరాబాద్ జిల్లా కలెక్టర్ కార్యాలయ ఉద్యోగానికి రాజీనామా చేసి, నిజాం వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నారు. స్టేట్‌కాంగ్రెస్ నిర్మాణాన్ని నిషేధించగా 1938లో సత్యాగ్రహం చేసి వరంగల్ జైలులో శిక్ష ననుభవించారు. ఆంధ్రమహాసభ ప్రముఖ నాయకుల్లో ఒకరు.

ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ స్టేట్ విలీనం ఉద్యమంలో పాల్గొని అరెస్టయ్యారు. 1947లో యెర్రుపాలెంలో రజాకార్లు ఆయన ఇంటిని దోచుకొని ధ్వంసంచేశారు.

గ్రంథాలయ, అస్పృశ్యత ఉద్యమంలో పాల్గొని దేశసేవ చేశారు.



2009 ఆగస్టు9న, క్విట్ఇండియా దిన సందర్భంగా రాష్ట్రపతి భవన్‌లో
భారత రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ చేత సత్కరించబడి, అభినందనలందుకుంటున్న నారాయణరావు పవార్





*To honour the Freedom Fighters*

363




*The President of India*

*requests the pleasure of the company of*

*Shri Narayan Rao Pawar*

*at a Reception*

*on Sunday, August 09, 2009 at 1745 hrs.*
*at Rashtrapati Bhavan, New. Delhi.*

భారత రాష్ట్రపతి నుండి ఆహ్వాన పత్రం

**Please bring this Card with you.**




అసెంబ్లీ మీటింగ్ హాలులో ప్రముఖ రచయిత శ్రీ ఏ. పండరీనాథ్ రచించిన 'హైదరాబాద్ విమోచనోద్యమం' పుస్తకాన్ని ఆవిష్కరించిన స్పీకర్ శ్రీ కె. ఆర్. సురేష్‌రెడ్డి. వేదికపైన శ్రీ పిరాట్లవెంకటేశ్వర్లు (కృష్ణా పత్రిక సంపాదకులు), శ్రీ జి. కిషన్‌రెడ్డి, (హిమాయత్ నగర్ ఎమ్ఎల్ఏ), రచయిత శ్రీ ఏ. పండరీనాథ్, కళాకారుడు : శ్రీ మారంరాజు రామచంద్రరావు, చివరగా శ్రీనారాయణరావు పవార్.







భార్య శ్రీమతి విజయలక్ష్మి గారితో నారాయణరావు పవార్ (30వ యేట)



20 వ యేట నారాయణ రావ్ పవార్



నారాయణరావు పవార్ 'లా' చదువుతున్నప్పుడు



21 వ యేట నారాయణ రావ్ పవార్





## నారాయణ రావ్ పవార్ బృంద సభ్యులు



బాలకృష్ణ, టైలర్



రెడ్డి పోతనాథం



పండిత్ విశ్వనాథ్



సహచర మిత్రులతో నారాయణరావు పవార్
కూర్చున్న వారిలో ఎడమ, చివరన







నారాయణరావు పవార్ - జగదీశ్ ఆర్య, గంగారాం
(నిజాంపై బాంబుదాడిలో పాల్గొన్న మిత్రులు)



గౌ॥ గవర్నర్ కృష్ణకాంత్‌తో నారాయణరావు పవార్ కరచాలనం





**హైదరాబాద్ సంస్థానాధీశుడైన నైజాముపై 4-12-1947న బాంబు విసిరిన విప్లవ వీరులకు ఆంధ్రప్రదేశ్ స్వతంత్ర సమరయోధుల సంస్థ సమర్పించు**

# సన్మాన ప్రశంసా పత్రము

శ్రీ నారాయణరావు పవార్ గారు,
శ్రీ గండయ్యగారు,
శ్రీ జగదీశ్ ఆర్యగారు,

మీరు త్యాగశీలురు. ఒక సాహస చర్యకుపూనుకున్నారు. 4-12-1947లో హైద్రాబాద్ సంస్థానాధీశులైన నిరంకుశ నాజీనైజాంపై బాంబును విసిరినారు. నైజాంకు ప్రాతినిధ్యం వహిస్తున్న జాగిర్దారి - జమీందారి - రజాకార్ మూకలపై వారు కొనసాగించిన హింస, దౌర్జన్యాలపై, మతోన్మాదంపై ప్రాథమిక పౌరహక్కులను కాలరాసిన కర్కశపాలనపై తెలుగు, మరాఠ, కన్నడ భాషల నణగద్రొక్కిన పాలనా విధానంపై మత దురహంకార దమన నీతిపై భారత యూనియన్ నుండి హైద్రాబాద్ సంస్థానాన్ని విడదీసి, నిరంకుశ ఇస్లాం మూక రాజ్యస్థాపన కర్కట, కర్కోటక రాజకుటిలనీతిపై బాంబుగా మేము భావిస్తున్నాము.

సాయుధ దౌర్జన్యం, హింస విచ్చలవిడిగా కరాళనృత్యం కొనసాగిస్తున్న రోజులవి. రజాకార్ దౌర్జన్యాలు మితిలేకుండా సాగుచున్న రోజులవి. ప్రజలు విధిలేకుండా వడిసెలు, కొడవళ్లు, కత్తి కఠారులు,కారపు ముంతలు ఎత్తిన రోజులవి. గ్రామ గ్రామం కోటగా మారిన రోజులవి. ఈ పరిస్థితుల్లో మీరు నైజాంపై బాంబు విసర తలపెట్టినారు. నిర్వహించారు. ఈ సాహస చర్య ప్రజల్లో ఆత్మవిశ్వాసాన్ని దృఢపరిచింది. ఉత్తేజాన్ని కలిగించింది. ప్రతిఘటనాశక్తి పెంపొందించింది. కాబట్టి మీ సాహస సాయుధ చర్యను, ప్రజా సాయుధ చర్యను, ప్రజా సాయుధ ప్రతిఘటనా, హితకారి చర్యగా పరిగణిస్తూ ప్రశంసిస్తున్నాము.

విప్లవ వీరులారా! మీరు సాంఘిక సంస్కరణోద్యమంలో పెరిగినారు. స్వామి దయానంద సరస్వతి హేతువాద బోధనలతో ప్రేరేపితులైనారు. సనాతన మత ఛాందస భావాలను ఎదిరించినారు. అంధ, మూఢ విశ్వాసాలను ఎదిరించినారు. జాతీయ సంస్కృతి పరిరక్షణకృషిలో భాగస్వాములైనారు. నేడాకృషి సన్నగిల్లింది. ఈ కృషి కల్పవృక్షాన్ని కాపాడవలసిన అవసరం నేడెంతగానో యున్నది. మీ శేష జీవితాన్ని ఈ కృషి సాధనలో కొనసాగించి జీవితమును సార్థకము చేసుకోగలరని అభిలషిస్తున్నాను.

మీ కృషి, మీ సాధనపట్ల ప్రశంసాభివందనాలు సమర్పించుకుంటున్నాము.

మీరు వృద్ధాప్యంలో జీవితాన్ని కొనసాగిస్తున్నారు. శరీర జవసత్వాలు సన్నగిల్లినాయి. అయినా మీ చైతన్యం జ్ఞానపటిమ పరిణితి చెందింది. అనుభూతి అపారం. మనోబలం, సంకల్పబలానికి కొదువలేదు. నవతరాలకు, యువతరాలకు మీ జ్ఞాన సంపత్తి, సంస్కార సేవలను అందిస్తారని అభిలషిస్తూ మరోసారి మీ ప్రశంసలను భక్తి-ప్రేమాంజలులను అందజేయుచున్నాము. మా పలుకులను పదివేల కానుకలుగా స్వీకరించ ప్రార్థన!

జయీభవ! జయాభివందనములు.

చిరునామా : 1-1-336/18.
లలితా భవన్, చిక్కడపల్లి,
హైద్రాబాద్ - 500 020.

ఇట్లు
**ఆం.ప్ర. స్వాతంత్ర్య సమర యోధుల సంస్థ**

తేది : 22-12-1996

★☆★ ★☆★ ★☆★



శ్రీ నారాయణరావు పవార్‌తో
గ్రంథ రచయిత : శ్రీ ఏ. పండరీనాథ్,
ప్రచురణ కర్త : శ్రీ మారం రాజు రామచంద్రరావు.

**స్వాతంత్ర్య సమరవీరుడు నారాయణరావ్ పవార్**